

# భారతీయ
# సాహిత్య సంస్కృతి ప్రకాశము



పోలూరి హనుమజ్జానకీరామశర్మ బి. ఏ. (ఆనర్సు)

[శ్రీ మదనమోహన మాళవీయ సాహిత్యమండలి]



# భారతీయ
# సాహిత్య సంస్కృతి ప్రకాశము



పోలూరి హనుమజ్జానకీరామశర్మ బి. ఏ. (ఆనర్సు

[శ్రీ మదనమోహన మాళవీయ సాహిత్యమండలి]

శ్రీ మదనమోహనమాళవీయ సాహిత్యమండలి
ద్వితీయప్రకాశనమునుండి పునర్ముద్రితము
1959

విలంబి, మార్గశీర్షము
*January, 1959.*

వెల : 50 నయాపైసలు

ఉమా ప్రింటర్సు
నెల్లూరు.

# కృతజ్ఞతాభివందనములు

మహామాన్య, శ్రీ మదనమోహనమాళవీయపండిత నామాంకితమైన యీ సాహిత్యమండలి దుర్ముఖినామసంవత్సర విజయదశమి (తే 11-10-1956) నాఁడు స్థాపింపఁబడినది. హేవిళంబి, ఉగాది (తే 1-4-1957) నాఁడు ప్రత్యేకాశయప్రణాళికతో, వ్యవస్థానియమావళితో నూతనకార్యనిర్వాహకవర్గ మేర్పడినది. అప్పుడు అధ్యక్షులగు శ్రీ పోలూరి హనుమజ్జానకీరామశర్మ B. A. (Hons) గారిచే సమకూర్పఁబడిన "మండలియాశయములు" సంగ్రహముగ కరపత్రరూపమున ప్రకటింపఁబడినవి.

పిదప తే 6-4-1957ది జరిగిన కార్యనిర్వాహకవర్గ సమావేశములో మండలియొక్క యాశయములు సమగ్రముగ విపులీకరించి తే 15-6-1957 దికి కార్యనిర్వాహకవర్గమునకు నివేదించుటకు నధ్యక్షులవా రభ్యర్థింపఁబడిరి. పిదప తే 19-8-1957, 1-9-1957 దులలో జరిగిన కార్యనిర్వాహకవర్గసమావేశములలో సంగ్రహరూపమున నున్న "మండలియాశయముల"ను మండలిప్రథమప్రకాశనమునందు ముద్రించుటకు తీర్మానింపఁబడినది. అట్లే ప్రథమప్రకాశనమున నివి "ప్రారంభాశయ సంగ్రహము"గ ప్రకటింపఁబడినవి.

పిమ్మట సభ్యులకు, నితరులకు మండలిగూర్చి ఆశయము అనుగూర్చి విపులముగ తెలిసికొనవలయు ననుకుతూహలము నానాఁటి కధిక మగుచుండుటవలన మండలిప్రారంభాశయములను విపులముగ వివరించి రచింపవలసినదిగ మే మనేకపర్యాయము అధ్యక్షులవారి నభ్యర్థించితిమి. వారు విలంబి, విజయదశమినుండి "ప్రారంభాశయప్రకాశము"ను "భారతీయసాహిత్యసంస్కృతిప్రకాశము"గ రూపొందించుచు మార్గశిర శుద్దదశమికి ముగించిరి. పిదప పూర్ణిమ, గురువారము తే 25-12-1958 దిన జరిగినమండలిసర్వసభ్య సమావేశమున కార్యదర్శి పి. బి. రాఘవేంద్రరావు దీనిని ప్రతిపాదింపగా సంస్కృతాధ్యాపకులు, సాహిత్యవిద్యాప్రవీణ, భాషాప్రవీణ, శ్రీ కె. యస్. రామానుజాచార్యులు గారు బలపఱచిరి. సభ్యులయేకగ్రీవామోదముతో నిది సక్రమమైనమండలి "ప్రారంభాశయప్రకాశము"గ తీర్మానింపఁబడినది.

మండలిప్రారంభాశయములను సర్వసభ్యుల కామోదపాత్రముగ చక్కఁగా రచించి యొసంగినయధ్యక్షులు శ్రీ పోలూరి హనుమజ్జానకీరామశర్మగారి నభినందించుచు నైసమావేశముననే కృతజ్ఞతాభివందనతీర్మానము ప్రతిపాదింపఁబడి యేకగ్రీవముగ నామోదింపఁబడినది.

| | |
|---|---|
| విక్రమసింహపురి,<br>విలంబి, మార్గశిర పూర్ణిమ<br>గురువారము. 25-12-58. | ఇట్లు,<br>పి. బి. రాఘవేంద్రరావు,<br>కార్యదర్శి. |

శ్రీ

# మదనమోహనమాళవీయ సాహిత్యమండలి

## ప్రారంభాశయసంగ్రహము



నేఁడు భారతదేశమున సంస్కృతిసముద్ధరణ మావశ్యకమైయున్నది. అనేకవిధములైనవిప్లవభావములతో నిండియుండిన యాధునిక భారతీయభావరంగమునందు యథార్థమైనభారతీయసంస్కృతినిగూర్చి జాగృతిని గలిగించుట కర్తవ్యమైయున్నది. అట్టి ధర్మకర్తవ్యమును ప్రభుత్వముపై నాధారపడక, రాజకీయపక్షముల ననుసరింపక విజ్ఞానవంతులగువారే స్వయంకృషితో సాగింపవలసియున్నది. ఇట్టి కర్తవ్యాచరణముకొఱకై శ్రీ మదనమోహనమాళవీయసాహిత్యమండలి యనునీసంస్థ యారంభింపఁబడుచున్నది.

భారతీయభాషలకే గాక, భారతీయసంస్కృతికంతకును సాధనముగా సంస్కృతసారస్వతము, ప్రధానవాహికగా సంస్కృతభాషయు నేర్పడియున్నవి. చరిత్రకందని ప్రాచీనయుగములనుండియు నీ భరతఖండము అఖండమైనజాతీయతతో నేటివఱకు వర్ధిల్లుచున్నది. ఈయఖండజాతీయతకు సంస్కృతభాషాసారస్వతములు పునాదులగుటచే వీనిని ప్రచారమునకుఁ దెచ్చి నేఁటిభారతీయులకుఁ ప్రాచీనభారతీయసంస్కృతితో సజీవమైన సంబంధము

లను నెలకొల్పుటయే భావిభారత జాతీయశ్రేయస్సునకు సాధన మని మేము గుర్తించుచున్నారము.

ఈ మండలి కార్యక్రమములలో సంస్కృతభాషాభ్యసనబోధనము, సంస్కృతసారస్వతప్రచారము ప్రధానములుగా నుండఁగలవు. ఈ సంస్కృతప్రచారమునకు దోహదము చేయునితర కార్యక్రమములు సైతము ప్రోత్సహింపఁబడును. దేశభాషాసారస్వతములందుఁ గృషిసలుపుట, లలితకళాభ్యాసము మొదలగునవి యానుషంగికముగాఁ బ్రోత్సహింపఁబడును. భారతీయులకుఁ బర్వదినములయిన శ్రీరామనవమి మొదలగునవి, యథోచితముగా సామాజికముగ జరుపఁబడును. వీనియందు సకలమతసామరస్యము, అఖిలభారతీయదృక్పథము ప్రధానసూత్రములుగఁ బాటింపఁబడును. ఈ కార్యక్రమములకు ననుబంధముగఁ గవితాగోష్ఠులు, కళాప్రదర్శనములు. కవిపండితకళాశిల్పిసత్కారములు జరుపఁబడును.

ఈసంస్థామండలిసభ్యులు మండలి కార్యక్రమములయందు, తమ వ్యక్తిగతజీవితములయందును, భారతీయసంస్కృతీసంప్రదాయములకు బద్ధులై వర్తించుటకు సర్వదా యత్నించుచుందురు.



ఓం

శ్రీరస్తు

# భారతీయ
# సాహిత్య సంస్కృతి ప్రకాశము

శ్రీ మదనమోహన మాళవీయ

సాహిత్య మండలీ

ప్రారంభాశయ ప్రకాశము

"विद्या धर्मेण शोभते"



श्लो. प्रणम्य परमात्मानं, माळवीयं च पण्डितम् ।
संस्कृति स्साहितीशक्तिं, भारतीया निगद्यते ॥

(పరమాత్మకు. పండితుఁ డగు మాళవీయునకు ప్రణమిల్లి సాహితీ సారరూపమగు భారతీయ సంస్కృతిని వివరించుచున్నాఁడను.)

## సంస్కృతి సాహిత్యమునకుఁ బోషకము

(1) మానవుని మానసవికాసానందములకు సాహిత్యమొక సాధనము. సాహిత్యమునకు సంస్కృతి పునాది. పోషక మైనసత్క్రమాహారము శరీరారోగ్యమునకు, శక్తి

నావశ్యకమైనట్లే సమీచీనమైన సాహిత్యసృష్టికి సత్సంస్కృతి యావశ్యకము. నేడు మనదేశమున సంస్కృతిని గూర్చిన యభిప్రాయములయం దవ్యవస్థ యధికముగ నున్నది. ముఖ్యముగ విద్యార్థులును, యువరచయితలును, నవ్యసాహిత్యప్రియులును, వివిధము లగువిప్లవభావములకు లోనై సంస్కృతియందును, సాహిత్యమునందు నేది గుణసహితమో, ఏదిహీనమో గుర్తింపఁజాలక పెడమార్గములఁ బడుచున్నారు. ఇప్పటి యీస్థితికి హేతువులను పరిశీలించి సంస్కృతినిగూర్చి సరియగుభావములను బ్రబోధింపవలసియున్నది.

## పాశ్చాత్యభావ ప్రాబల్యము

(2) మనదేశమున నిటీవల చాలమార్పులు కలిగినవి. ప్రజలు క్రమక్రమముగఁ దమకుఁ దెలియకుండఁగనే భారతీయసంస్కృతికి దూరులై పాశ్చాత్యభావములకు లోఁబడిపోవుచున్నారు. 1837 లో మెకాలే మనదేశమున నాంగ్లవిద్యావిధానమును బ్రవేశపెట్టిననాఁడే యీభావపరివర్తన మింతమమించుగఁ బ్రారంభమైనదని చెప్పవచ్చును. మనదేశమునందు 1857 సంవత్సరప్రారంభమున మదరాసు, బొంబాయి, కలకత్తానగరములలోఁ బాశ్చాత్యవిద్యాకేంద్రము లగుమూఁడువిశ్వవిద్యాలయములును స్థాపింపఁబడినవి. తరువాతఁ గొలదినెలలలోనే యాంగ్లప్రభుత్వముపైఁ బెద్దవిప్లవము వచ్చెను. విప్లవ మణఁచివేయఁబడిన పిదప దేశమునందు శాంతి యేర్పడి యాంగ్లవిద్యకుఁ,

పాశ్చాత్యభావములకుఁ బ్రచారావకాశ మేర్పడెను. వీని వలన భారతీయులలోఁ దమప్రాచీనవిద్యావిజ్ఞానముల యెడల నాచారసంప్రదాయములయెడ వైముఖ్యము, పాశ్చాత్య విజ్ఞాన సంప్రదాయములయం దాసక్తియును ప్రబలెను. ఇదియే సంఘసంస్కారోద్యమరూపమునఁ బ్రకట మయ్యెను. ఆంగ్లదేశచరిత్రాదిపఠనమువలన రాజకీయముగ సామ్రాజ్యాధికారధిక్కరణము, స్వాతంత్ర్యాభిలాష, ప్రజాస్వామ్యవిధానసమాదరణము మొదలగు భావములు సైతము భారతీయులందుఁ బ్రచారము నందెను. ఈరాజకీయచైతన్యమువలన నే జాతీయభావము జాగృతమై, స్వాతంత్ర్యసమరోత్సాహము విలసిల్లెను. ఈజాతీయ భావమువలనఁ గొంతవరకుఁ బ్రాచీనభారతీయవిజ్ఞానము నెడల మరల నాదరము కలుగఁజొచ్చెను. కాని యిది దృఢముగ వేరూనకముందే యంత్రాధీనజీవనము, లౌకాయతసిద్ధాంతమును సకలదేశములందును వ్యాపించుచు భారతదేశమునందును బాదము పెట్టినవి. తక్కిన దేశములందువలెనే మనదేశమునందును జాతీయసంస్కృతికిని, లౌకాయతవాదసర్వసమత్వాదిభావములకును నిరంతర సంఘర్షణ మారంభ మైనది.

## సనాతనధర్మసంస్కృతికిఁ బ్రతినిధి శ్రీమాళవీయపండితుఁడు

(3) స్వరాజ్యసమరోద్యమసమయముననే పాశ్చాత్య భావప్రభావమునకు జాతీయనాయకు లనేకులు లోఁ

బడిపోవుటను మొదట గుర్తించి, యీభావముల నరికట్టు టకు భారతీయసంస్కృతిని కాపాడుటకును ప్రయత్నించినవారిలోఁ బ్రముఖుఁడు మహామాన్య శ్రీ మదన మోహనమాళవీయపండితుఁడు. రాజకీయముగ, సాంఘిక ముగ నెన్ని విప్లవములు సంభవించినను భారతీయులు స్వ ధర్మమును విడనాడనక్కఱలేదని యాయన ప్రబోధించెను. జాతీయనాయకులకుఁ జాలమందికి భారతీయతపై మమ కార మున్నను వారు మాళవీయునివలె వేదశాస్త్రముల ప్రామాణ్యమును, ధర్మానుష్ఠానావశ్యకతను గుర్తింపలేదు. వారు తమకుఁ దోఁచినదే భారతీయత యని భావింపుచు సంప్రదాయానుగతములైన ప్రాచీనాచారముల నాదరింప కుండిరి. మరియు నిరంతరము పరిణమించుచుండు నాధు నిక నాగరకత కనుకూలముగ మనయాచారములును మాఱ వలయు నని వారు భావించుచుండిరి. ఆచారసంప్రదాయ ములు వేదశాస్త్రానుసారముగనే సాగింపవలయును గాని నిత్యనూతనముగ మాఱుచుండు నాగరికతనుబట్టి కా దని యా యన భావించెను.

## ఉత్తమజాతీయనాయకుఁడు

(4) శ్రీ మాళవీయపండితుఁడు సకలభారతదేశ మునకుఁ బ్రాతస్స్మరణీయుఁడు. ఆయన వేదశాస్త్రముల యందుఁ బండితుఁడు, పాశ్చాత్యవిద్యలయందుఁ బ్రవీ ణుఁడు, సనాతనధర్మనిష్ఠాగరిష్ఠుఁడు. పూర్వాచారపరుఁ డయ్యు నాతఁడు దేశసేవారతుఁడై రాజకీయములందుఁ జాల్గొనుచు నాయకోత్తముఁడై విలసిల్లెను. సంఘసేవా

రంగమున సాధారణప్రజానీకమునకు తాతడు కావించిన సేవ యపారము. జాతీయవిద్యాభివృద్ధికై యాయన గావించిన కృషి యద్వితీయము. నేటి కాశీహిందూవిశ్వవిద్యాలయము మాలవ్యాజీయొక్క కృషి కమూల్య మగు ప్రత్యక్షఫలముగ నున్నది. అమహామాన్యుని పేరు నేటికి నఖండభారత జాతీయతకు, సనాతనధర్మపరత్వమునకు, దేశభక్తికి, మానవసేవాభావమునకుఁ బ్రాచ్యపాశ్చాత్యశాస్త్రవిజ్ఞాన కళాభినోద సమన్వయమునకుఁ బ్రతీకముగ నున్నది.

## మాలవీయాశయానుగుణ మైనసాహిత్యసేవ

(5) తన్మహనీయనామాంకిత మైనయీసాహిత్య మండలి తదాశయానుగుణముగా భారతజాతీయసంస్కృతి సాహిత్యసేవార్థమే వర్తించుచున్నది. నేడు విద్యార్థియువ జనములందు సాహిత్యప్రియులందును బ్రబలుచున్న నాస్తిక వాదము, ధర్మవైముఖ్యము, భారతీయసంస్కృతిపరాఙ్ముఖత్వము, భ్రాంతిమూలకాభిప్రాయములు మొదలగు నభారతీయభావపరంపరల నరికట్టుటకు, యథార్థ మగుభారతీయసంస్కృతిని బ్రకటించుటకు, తత్ప్రముఖసాధనము లగుసంస్కృతభాషావాఙ్మయముల పఠనావశ్యకతను బ్రబోధించుటకును ఈమండలి ప్రయత్నించుచున్నది.

## సాహిత్యశబ్దము ప్రతీకము

(6) ఇందు సాహిత్యశబ్దము విశాలార్థమున స్వీకరింపఁబడుచున్నది. నేడు సాహిత్యాభిరుచి రచనము

సమీచీనముగ నుండవలయు నన్నచోఁ బ్రాచీనాధునిక ప్రాచ్యపాశ్చాత్యసాహిత్యకళాసమన్వయ మేకాక శాస్త్ర విజ్ఞానసమన్వయపరిచయముసైత మావశ్యక మైయున్నది. ఈకారణముచే సాహిత్యశబ్దము వివిధశాస్త్రవిజ్ఞానకళా వినోదములకు, భారతీయాంతర్జాతీయదృక్పథములకు, సంస్కృతాధ్యయనాన్యభాషాసమాదరములకును సహి తత్వప్రతీకముగా సంభావింపఁబడుచున్నది.

## జీవితదృక్పథమే సంస్కృతి

(7) మొదట సంస్కృతి యన నేమో గుర్తించి, అది యేల యావశ్యకమో తెలిసికొనవలసియున్నది. దీని లక్షణవిషయముననే యభిప్రాయభేదము లనేకములు కలవు. కొందఱు దానిని విద్యాభ్యాసఫలముగనో, విజ్ఞానముగనో, నాగరకతాలక్షణముగనో, సుజనత్వముగనో, సద్వర్తనముగనో భావించుచుందురు. మఱికొందఱు దీని యనిర్వచనీయమే యని చెప్పుదురు. కాని సంస్కృతి విద్యాభ్యాసాదుల కన్నింటికిని సంబంధించియున్నను, వానికన్నను విశిష్టమైనది. విషయవిశేషగ్రహణమే విద్యాభ్యాసము. వివిధవిశేషసంకలనమే విజ్ఞానము. విజ్ఞానము వలన యంత్రములు సృష్టింపఁబడి సౌకర్యము అధికముగాఁ గల్గుచుండును. ఈసౌకర్యాత్మకజీవనమునే నాగరకతయని చెప్పుచుందుము. ఇట్టి నాగరకతకును, సంస్కృతికిని చాలభేదము కలదు. బౌద్ధసంస్కృతి, క్రైస్తవసంస్కృతి, ముస్లిమ్‌సంస్కృతి, ఆంగ్లసంస్కృతి, జర్మన్‌సంస్కృతి

మొదలుగ ననేకవిధములుగ నిది పేర్కొనఁబడుచున్నది. వీనిని జక్కఁగాఁ బరిశీలించినచో సంస్కృతి యనుపద మొకప్రత్యేకమైన మతదృక్పథమును గాని, జాతీయజీవన దృక్పథమును గాని, వ్యక్తీకరించుచున్న దని చెప్పవచ్చును. కావున జీవితమునుగూర్చిన దృక్పథమే సంస్కృతి. ఇది యేవ్యక్తియందైనను తనజీవితమునందు, నితరుల తోడి వర్తనమునను వ్యక్తమగు దృక్పథ మనియే చెప్పవలసి యున్నది. ఇది విద్యాభ్యాస విజ్ఞానసౌజన్యాది సకలసంస్కారములకు ఫల మని చెప్పవచ్చును. ఇది జాతిమతదేశ భేదములను పురస్కరించుకొని భిన్నతను, విశిష్టతను, పొందుచుండును.

## సంస్కృతి నాగరకతను నియమింపవలెను

(8) సంస్కృతి. నాగరకతలు మనశ్శరీరముల వంటివి. నాగరకత బాహిరమైనజీవనసౌకర్యములను సూచించును. సంస్కృతి సూక్ష్మమైనమానసిక పరిణామమును సూచించును. బుద్ధి శరీరమును నియమించినట్లే సంస్కృతి నాగరకతను నియమించును. ఈ కారణము చేతనే నాగరకత యెంతగానభివృద్ధి నొందిన సంస్కృతి ప్రబోధ మంతగా నావశ్యకమగును.

## శాస్త్రజ్ఞానము నాగరకతాభివృద్ధికి సాధనము

(9) మానవుఁడు నిరంతరము శ్రమను తగ్గించుకొనుటకు, సుఖమును పెంపొందించుకొనుటకు ప్రయత్నించు

చుండును. ఈప్రయత్నముననే ప్రకృతిశాస్త్రజ్ఞానము నిరంతర మభివృద్ధి నొందుచున్నది. ఈజ్ఞానమునుపయోగించుటవలన యంత్రములు సృష్టింపఁబడుచున్నవి. యంత్రమనఁగా నల్పపరిశ్రమచే నధికఫలము నొసంగుసాధనము. నీటిఆవిరివలన, విద్యుచ్ఛక్తివలనఁ బనిచేయును యంత్రములు సృష్టింపఁబడినవి; సృష్టింపఁబడుచున్నవి. అణుశక్తివలన సైతము కడుశక్తిమంతము లగుయంత్రములు సృష్టింపఁబడుచున్నవి. యంత్రములయుపయోగమువలన మానవులకు సౌకర్యములు దినదినాభివృద్ధిగఁ గలుగుచున్నవి. ఈసౌకర్యాభివృద్ధియే గదా నాగరకత. ఈకారణముచేతనే నడచిపోవువానికన్నను బండిలోఁబోవువాఁడును, వానికన్నను మోటారుకారులోఁ గాని, రైలులోఁ గాని ప్రయాణము చేయువాఁడును, వానికన్నను విమానమునందుఁ బయనించువాఁడును నాగరకతాభివృద్ధినొందినవా రని చెప్పుచుందుము. ఈసాధనపరంపరాభివృద్ధి యంతయుఁ బ్రకృతిశాస్త్రవిజ్ఞానాభివృద్ధిచేతనే సంభవించిన దనుట స్పష్టమైనవిషయము.

## శాస్త్రజ్ఞానము నిశిత మగుఖడ్గమువంటిది

(10) ఈదృష్టితో గమనించినచో నాగరకతాభివృద్ధికిఁ బ్రముఖసాధన మగుచున్న ప్రకృతిశాస్త్రజ్ఞానము మానవులకుఁ గేవలము వరప్రసాదమువంటి దని చెప్పవలసియున్నది. కాని యీప్రకృతిశాస్త్రజ్ఞాన మెల్లప్పుడును నాగరకతాభివృద్ధికే సాధనమై మానవాభ్యుదయముననే

సాధించుచున్నదని చెప్పఁజాలను. ప్రకృతిశాస్త్రజ్ఞానము నిశితమగుఖడ్గము వంటిది. అదియచేతనము. తనయుపయోగము తాను నిశ్చయింపఁజాలదు. మానవు లెట్లుపయోగించిన నట్లుపయోగపడును. మానవనాగరకతాచరిత్రలో బ్రకృతిశాస్త్రజ్ఞానమువలన సౌకర్యసాధనము లగుయంత్రములే గాక మారణసాధనము లగుయంత్రములు సైతము సృష్టింపఁబడుచు నేయున్నవి. నాగలి, రాట్నము, మగ్గము, రథము మొదలగువానితో పాటు కత్తి, గండ్రగొడ్డలి, విల్లునంబులు, తుపాకి మొదలగునవి సైతము సృష్టింపఁబడుచునే యున్నవి. కావున శాస్త్రజ్ఞాన మచేతన మగు సాధన మై మానవసంకల్పాధీనముగ నుపయోగపడుచుండును. సాధారణముగ ప్రభుత్వములు, ప్రజాసంస్థలు శాస్త్రజ్ఞానముయొక్క వినియోగవిధానమును నిశ్చయించుచుందురు. ప్రభుత్వనేతలు గాని, సంఘనాయకులు గాని, వివేకసహితు లైనచో వారివలన సద్వినియోగము నొందిశాస్త్రజ్ఞానము మానవులకు వరప్రసాద మే యగును. కాని వారు వివేకరహితు లైనచో నదియే మారణహోమమునకు మహితసాధన మగును. ప్రకృతిశాస్త్రజ్ఞానదుర్వినియోగము వలనిభయంకరఫలితములు నేఁడు మనకు ప్రత్యక్ష మగుచునే యున్నవి. ఈవిషయమునుగూర్చి 1917 నవంబరు 30 తేదీన తనపేరిట నెలకొల్పఁబడుచున్న పరిశోధనాలయమును మాతృదేశమున కంకితము గావించుచు జగత్ప్రసిద్ధశాస్త్రాచార్యుఁ డగుశ్రీజగదీశ్‌చంద్రబోసు ఇట్లు పల్కెను. “పాశ్చాత్యదేశములందుఁ బదార్థశాస్త్రవిజ్ఞా

నము నుపయోగించు కార్యకలాపములవలన శక్తియందు, సంపన్నతయందు నతిశయము కలిగెను. శాస్త్రిజ్ఞానమును దైనందినజీవితరంగమున కుపయోగింపవలయు ననునాతురత జ్వరమువలె నావేశించుచున్నది. ఇదియును రక్షణమునకై గాక చాలవఱకు నాశనమునకే యుద్దేశింపఁబడుచున్నది. దీనిని నియమించుశక్తియొకటి లేనికారణమున నాగరకత వినాశోన్ముఖమై యస్థిరమై కంపించుచున్నది. వినాశముతోడనే యంతమొందగలఁ యీయున్మత్తవేగమునుండి మానవుని రక్షింపఁగల సహాయక మగునాదర్శ మావశ్యకమై యున్నది.''

["Such material activities have brought in the west their fruit, in accession of power and wealth. There has been a feverish rush in the realm of science, for exploiting applications of knowledge, not so often for saving as for destruction. In the abscence some power of restrain, civilisation is trembling in an unstable poise on the brink of ruin. Some Complementary ideal there must be to save man from that mad rush which must end in disaster" — Page 205

From "Sir Jagadis Chunder Bose."

Published by Ganesh & Co, Madras]

## సంస్కృతిహీనుఁడు యంత్ర సమానుఁడు

(11) కావున శాస్త్రజ్ఞానము దుర్వినియోగము నొందకుండుటకు దాని నుపయోగించుమానవులందు వివేక

మావశ్యకము. కాని యేప్రకృతిశాస్త్రమునందును, ధర్మా ధర్మవిచారణమునకు పుణ్యాపాప విచక్షణతకు తావు లేదు. అట్టిది సంస్కృతిప్రబోధమువలననే సంభవించును. ధర్మా ధర్మవివేకము, ఉదారత, పరోపకారభావము, సేవా భావము మొదలగునవి యన్నియును సంస్కృతివలననే సంభవించును. సంస్కృతిహీనమైన శాస్త్రజ్ఞానము మానవుని యంత్రసమానునిగఁ జేయును. కావున శాస్త్రజ్ఞానము మానవవినాశసాధనము కాకుండ నాగరకతాభివృద్ధికి సాధన మగుటకు మానవుఁడుయంత్రాధీనుఁడు, యంత్ర సమానుఁడు కా కుండుటకును సత్సంస్కృతి యావశ్యక మైయున్నది.

## సంస్కృతిహీనమగు నాగరకత నిష్ఫలము

(12) ప్రకృతిశాస్త్రజ్ఞానము, మారణయంత్ర నిర్మాణసాధనముకాకుండ, సౌకర్య సాధనమే యగు చున్నను సంస్కృతియొక్క యావశ్యకత తీరిపోదు. కేవలనాగరకతాభివృద్ధి యైనను సత్సంస్కృతిహీనమై నచో శ్రేయోదాయక మగు నని చెప్పఁజాలము. మానవున కెప్పుడును దుఃఖనివృత్తి సుఖప్రాప్తియే పరమలక్ష్యములు. నాగరకతాభివృద్ధివలన మానవుఁడు వీనినే సాధింపఁగోరు చుండును. కాని సుఖమున కాయురారోగ్యము లత్యంత మావశ్యకములు. నాగరకతవలన నెన్ని సౌఖ్యములు, భోగ ములునుకలిగినను, ఆయురారోగ్యహీనున కవి నిష్ఫల ములు. ఎన్ని సౌకర్యములు కలుగుచున్నను మానవుల

కాయురారోగ్యములు తగ్గుచున్నట్లే కన్పించుచున్నది. విశృంఖలసుఖానుభవమే యిందులకు హేతు వని చెప్ప వచ్చును. నాగరకత సుఖభోగములను సమకూర్చునే గాని వానియనుభవమున నియమములను బోధింపదు. చలనచిత్ర నిర్మాత తాను నిర్మించినచిత్రము నిరంతరము ప్రదర్శింపం బడవలయు నని కోరుచుండునే గాని సాధారణమానవుండు దాని నెన్నిపర్యాయములు చూడవచ్చునో, ఎన్ని పర్యాయములకు మించి చూడరాదో బోధింపండు. కాని మాటిమాటికి వానిని చూచుచున్నచో దృష్టి మందగించు ననుట స్పష్టము. శరీర మొకయంత్రము. నిర్మాణమునందే దానిశక్తి పరిమితమై యుండును. సుఖానుభవము శరీరేంద్రియవ్యాపారమూలము. దీపప్రకాశముచే వత్తినుండి తైలమువలె సుఖానుభవముచే నింద్రియములమూలమున జీవశక్తివ్యయము నొందుచుండును. అపరిమితధనవ్యయము సంపన్నతనువలె, విశృంఖలసుఖానుభవము శరీరమును శక్తిహీన మొనరించి యాయురారోగ్యముల హరించును. కావున నాగరకతాభివృద్ధితోపాటు వానివలనం గలుగు సుఖముల ననుభవించుటకు మానవుల కాయురారోగ్యములును చక్కగా నుండునట్లు చూడవలయును. ఇది నియమపూర్వకజీవనమువనే సిద్ధించును. దీనికి సదాచారపరత్వము, శాంతజీవనము నావశ్యకములు. ఇవి సత్సంస్కృతిమూలముననే సాధ్యములు. కావున శాస్త్రవిజ్ఞానము మానవవినాశమునకు కాక మానవాభ్యుదయమునకే సాధనమగుటకు, నాయురారోగ్యరక్షణమునకై నియతశాంతజీవన మేర్పడుటకును, సత్సంస్కృతి యావశ్యకము.

## ధర్మ సంస్కృతి

(13) భారతదేశమున నీసంస్కృతి ధర్మతత్త్వాత్మకమై విలసిల్లుచున్నది. భారతజాతీయజీవన మంతయుం బ్రాచీనకాలమునుండియు ధర్మతత్త్వములమీఁదనే యాధారపడియున్నది. ధర్మ మనఁగా ధరించునది యని యర్థము. ఏది దేనియొక్క స్థితిగతుల కాధార మగునో యది దానికి ధర్మ మగును. ఆహారనిద్రలవలన శరీరమునకు స్థితి, గతియును గలుగుచున్నది. కావున దానికవి ధర్మము లగుచున్నవి. మఱియును శరీరమునకు కేవలస్థితిగతులను మాత్రమే గాక చిరజీవితమును, ఆరోగ్యసౌష్ఠవములను కోరుచుందుము. ఇవి లభింపవలయు నన్నచో నాహార నిద్రలయందు కొన్ని నియమములును నావశ్యకము లగును. నియమసహితములైనయాహారనిద్రలు శరీరసౌష్ఠవమునకు చిరజీవితమునకు హేతువు లగుచున్నవి. కావున నానియమములును ధర్మములే యని చెప్పఁబడుచున్నవి. వేని నవలంబించుటవలన సుస్థితి కలిగి పురోభివృద్ధి కవకాశ మేర్పడునో యవియన్నియు ధర్మము లనియే చెప్పఁబడును. శ్రీకృష్ణుఁడు కర్ణపర్వమున ధర్మమునుగూర్చి యిట్లు చెప్పెను. "ధారణమువలన ధర్మ మేర్పడుచున్న దని చెప్పుదురు. ధర్మము ప్రజలను ధరించుచున్నది. ఏది ధారణసంయుక్త మగునో యదియే ధర్మ మని నిశ్చయము"

[श्लो· धारणाद्धर्ममित्याहुः, धर्मो धारयते प्रजाः ।
यत्स्याद्धारणसंयुक्तं, स धर्म इति निश्चयः ॥
महाभारत, कर्ण· 69.59]

కావున సకలప్రజాజీవనమునకును ధర్మమే యవలంబన మని చెప్పవలసియున్నది. కావుననే వేదశాస్త్రము లన్నియు నీధర్మవిధానములనే యుద్ఘోషించుచున్నవి. ధర్మమువలన లౌకికము లైనశ్రేయస్సులు సిద్ధించునట్లే తత్త్వజ్ఞానమువలన నిశ్శ్రేయస మగుకైవల్యము లభించును. జగజ్జీవేశ్వరవిచారణమువలన తత్త్వజ్ఞాన మేర్పడును. తత్త్వజ్ఞానముచే లభించుమోక్షమును సైతము కొందఱు మోక్షధర్మ మని చెప్పుదురు. "దేనిచే నీవిశ్వము ధరింపఁబడుచున్నదో యది ధర్మము"అని ధర్మశబ్దార్థమును కొందఱు నిర్వచింతురు. ఈయర్థమున విశ్వాధార మగుపరమాత్మయే ధర్మశబ్దవాచ్య మగును. తత్ప్రాప్తిరూప మగుమోక్షమును, తత్సాధన మగుతత్త్వజ్ఞానమును ధర్మశబ్దవాచ్యములే యగును. కావున భారతీయులది ధర్మసంస్కృతి యని చెప్పవచ్చును.

## భారతీయసాహిత్యమునకు ధర్మసంస్కృతియే సారము

(14) ఈధర్మసంస్కృతియే భారతీయసాహిత్యమునం దంతట నంతర్వాహినిగఁ బ్రవహించుచున్నది. భారతీయసాహిత్యమునకు ధర్మసంస్కృతియే సారము. ఈధర్మసంస్కృతినే కాళిదాసమహాకవి రఘువంశారంభమునఁ జక్కఁగా సంగ్రహించి చెప్పెను. ఉత్తమరాజన్యు లగు రఘువంశపురాజుల నాతఁ డిట్లు వర్ణించెను. "రఘువంశపురాజులు యథావిధిగ నగ్నిహోత్రకార్యములఁ గావించుచు

యాచకులకోరికలను దీర్చి యర్చించుచు, తప్పులకుఁ దగినట్లుగ దోషులను దండించుచు జాగరూకులై పరిపాలించుచుండిరి. వారు త్యాగముకొఱకే సంపదలను సమకూర్చుచుండిరి; సత్యముకొఱకే మితముగ భాషించుచుండిరి; కీర్తికొఱకు విజయేచ్ఛను కలిగియుండిరి. సంతతికొఱకే గార్హస్థ్యము నవలంబించుచుండిరి. శైశవమునందు విద్యల నభ్యసించుచు, యౌవనమునందు సుఖభోగముల నందుచు, వృద్ధత్వమున మునివృత్తి నవలంబించి, తుదకు యోగమార్గమున శరీరమును త్యజించుచుండిరి.''

[శ్లో· यथाविधिहुताग्नीनां, यथाकामार्चितार्थिनाम् ।
यथापराधदण्डानां, यथाकालप्रबोधिनाम् ॥

శ్లో· त्यागाय संभृतार्थानां, सत्याय मितभाषिणाम् ।
यशसे विजिगीषूणां, प्रजायै गृहमेधिनाम् ॥

శ్లో· शैशवेऽभ्यस्तविद्यानां, यौवने विषयैषिणाम् ।
वार्द्धके मुनिवृत्तीनां, योगेनान्ते तनुत्यजाम् ॥
- रघुवंशः, प्रथमसर्गः, श्लो, 6, 7, 8]

ధర్మార్థకామమోక్షము లనుచతుర్విధపురుషార్థములతో సంపూర్ణమైన యిట్టియుత్తమమైనవాదర్శజీవితవిధానము మఱియొకచోఁ గానము. సామ్రాజ్యభారధారేయు లైన యారాజులు శైశవమునందు నియతముగ విద్యాభ్యాసమొనర్చి యౌవనమునందు గృహస్థులై సంపదల నార్జించిరి. వారిగార్హస్థ్యము సంతతికొఱకే గాని, కామసంతృప్తి

కొఱకుగాదు. ఆ రార్జించినసంపదలు దానముకొఱకే గాని, భోగవిలాసములకొఱకు గాదు. నిరంతరము జాగరూకు లై యధర్మమును నిగ్రహించుచుఁ బ్రజాపరిపాలనముఁ గావించుచుండియు శ్రౌతస్మార్తకర్మల నుపేక్షింపక యథావిధిగ నగ్నిహోత్రముల నర్చించుచుండిరి. దిగ్విజయములచే కీర్తిని, సంపదల నార్జించియున్నను వానిని పరమార్థముగ భావించి వానియం దాసక్తులు గాక, వృద్ధత్వమునందు పుత్రులకు రాజ్యభారము నొప్పగించి, మునివృత్తి నవలంబించి, వనముల కేఁగుచుండిరి. అచ్చట నిరంతరతపోయోగానుష్ఠానములచే జ్ఞాను లై యోగమార్గమున శరీరములను దృజించుచుండిరి. ఇట్టిభోగత్యాగపూర్ణమైన జీవితవిధానమే యేనాఁ డైన నెల్లరకు నాదర్శప్రాయమని చెప్పవలసియున్నది.

## దేహాత్మవాదము

(15) కాని నేఁడు ప్రచారమం దున్నలోకాయత సిద్ధాంతము, దేహాత్మభావము, ఇట్టిసంస్కృతియెడ వైముఖ్యమును గలిగించుచున్నవి. ప్రాచీనభారతీయవిజ్ఞానమున ననేకపర్యాయములు ఖండింపఁబడి, నిరాకరింపఁబడినవానిలో దేహాత్మవాద మొకటి. ఇదియే సమష్టియందు లోకాయతవాదము. దీనినే నాస్తికవాద మనియు వ్యవహరింతురు. ఇంద్రియగోచర మగునది లోకము. అట్టిలోకమే పరమార్థముగా కలది లోకాయతము. అప్రత్యక్షము లైనపరలోకములను, జన్మాంతరములను లోకాయతు లంగీ

కరింపరు. ధర్మాధర్మములు దేహపర్యంతమే సుఖదుఃఖములను కలిగించునుగాని దేహాంతరలోకాంతరముల నొసంగవు; దేహనాశముతోడనే జీవనాశము సైతము సంభవించు నని వీరు చెప్పుదురు. కావున పరలోకసుఖమునకై గాని, జన్మాంతరమహత్త్వమునకై గాని చేయఁబడు దేవపూజాదికర్మలు వ్యర్థములు; మఱియును సమాజసమష్టిశక్తివ్యయరూపమున నష్టదాయకములు. అట్టి యాచారవిశ్వాసములు సమాజముయొక్క భౌతిక మైనసర్వతోముఖాభివృద్ధికి ప్రతిబంధకములు. కావున ధర్మకర్మసంస్కారములు పరిత్యాజ్యము లని వీరిమతము.

## పుణ్యపాపములు నిర్మూలము లగును

(16) ఈభావములవలన ధర్మాధర్మములు, పుణ్యపాపములు నిర్మూలము లగుచున్నవి. ధర్మాధర్మములకు పుణ్యపాపభావము మూలము. ఆభావమునకు లోకాంతరజన్మాంతరములు మూలము. లోకాయతసిద్ధాంతమున లోకాంతరములు గాని, దేహముకంటె భిన్నుఁడగు జీవుఁడు గాని, వానికి జన్మాంతరములు గాని లేవు. ఇట్లయినచో నీలోకమున నెవఁడైనను పాపకృత్యము లాచరించుచు శిక్షను తప్పించుకొనఁగలిగినచో మఱి యేలోకాంతరజన్మాంతరశిక్షలకుఁ గాని భయపడ నక్కఱ లేదు. స్వర్గాదిలోకములు, జన్మాంతరఫలములు లేవు. కావున పుణ్యకార్యములు చేయుటయు నిష్ప్రయోజనమే యగును. ఇప్పటిదేహముతోఁ బొందఁగలిగిన సుఖభోగముల నన్నింటిని బొందుటయే మానవజన్మమునకు చరితార్థత యగును.

అట్టియెడ నిప్పుడు స్వప్రయోజనములను వీడి పరోపకార మునకై పాటుపడుటయు నిరర్థకమే యగును. ఇప్పటితన సుఖమును వదలుకొని మానవసేవాదిభావనులతో శ్రమిం చుచుండుటయుఁ దెలివితక్కువయే యగును. సేవాభావ మునకు ప్రత్యక్షఫలముగ నాత్మసంతృప్తిని పొంది యానం దింపఁ గలమహనీయులు కొందఱున్నను, ఎల్లరు నట్టి వారుగా నుండుట యసంభవము. పెక్కుమందికిఁ దాము గావించిననిస్స్వార్థ మగుకృషి యీలోకమునందు ఫలిం పకపోయినను పరలోకమునం దైన ఫలించు నని సంతృప్తి కలుగుచుండును. ఎట్లైనను లోకాంతరజన్మాంతరఫలములు లేనిపక్షమున, ప్రతివ్యక్తియును సాధ్యమైనంతవఱకు ప్రకృతిశక్తులను, తోడిమానవులను సాధనముగఁ జేసికొని యీశరీరముతోఁ బొందఁగలిగినసకలసుఖములను బొందు టయే పరమార్థ మగును. ఈపరమార్థభావమే ప్రబలినచో ప్రేమ, గౌరవము, మైత్రి, మొదలగునవి స్వార్థసాధన ములు మాత్రమే యగును. ప్రభుత్వములు సైత మీభావ ముల ననుసరించి తాము బలిష్ఠము లైనవెంటనే తక్కిన దేశములను తమమార్గమునకుఁ ద్రిప్పుకొనుచు వానిపై శాశ్వత మగునాధిపత్యమును స్థాపింప ప్రయత్నించును. కావున నీభావములు సర్వవిధముల శాంతినిర్మూలకములే గాని శాంతిసాధకములు కానేరవు.

## నియమరహితజీవనము

(17) ఈవాదములవలన నవాంతరఫలముగ నేర్ప డునది నియమరహితజీవనము. దీనికిఁ దోడుగ యంత్రనాగ

రక సౌకర్యములు నిరంతరము సులభ మగుచుండుటవలన విశృంఖల మగుభోగలాలసత్వము పెరుగుచున్నది. దీని మూలమునఁ బ్రత్యక్షఫలము లగునాయురారోగ్యములు క్షీణించుచున్నవి. నియమపరత్వమువలన, లేదాసదాచార పరత్వమువలన నింద్రియశక్తులు సంగృహీతము లైయాయు రారోగ్యములను, తేజోమహితత్వమును పెంపొందించును. శక్తి సంపన్నులు ఆత్మోపకారమును, పరోపకారమును సాధింపఁగలరు. నియమరహితులు, నిర్వీర్యులు, నిస్తేజస్కులు, మందబుద్ధులు, అల్పతరాయువులు, ఉగ్రరోగ సంకలితులు సమాజమునకు భారభూతులగుదురే కాని ప్రయోజనకరులు కాఁజాలరు. ఈకారణముచే నీదేహాత్మవాద ప్రాబల్యము నరికట్టి ధర్మసంస్కృతిని ప్రబోధింపవలసి యున్నది.

## దేహాత్మవాద మశాస్త్రీయము

(18) దుష్ఫలితములదృష్టితోడనే కాక శాస్త్రీయ మగువిచారణదృష్టితో సైతము దేహాత్మవాదము నిరాకరింపఁదగియున్నది. మానవుఁడు దేహముతోడనే పుట్టి, దానితోడనే నశించుచున్నాఁడనుట యసంగతము, నశాస్త్రీయము. దేహాత్మవాదు లందఱును ప్రకృతిశాస్త్రపరాయణులు, పరిణామవాదులు, హేతువాదసమారాధకులు. వీరు ప్రతివిషయమునను కార్యకారణభావమును గుర్తింతురు. కారణము లేక కార్యము పుట్టదని దృఢముగ విశ్వసింతురు. ఈసిద్ధాంతములకు ఫలముగనే సృష్టిలోని

పదార్థ మంతయు పరిణమించుచున్నదే గాని యేపదార్థ మైనను క్రొత్తగా పుట్టుట లేదని, నశించుట లేదని సిద్ధాంత మొనరించుచున్నారు. అట్లే శక్తియు (Energy) రూపాంతరమున పరిణమించుచుండునే కాని పుట్టుకను నాశమును పొందదని చెప్పుదురు (Matter or Energy can neither be created nor destroyed). ఇప్పటి మానవశరీరనిర్మాణ మాగంతుకము కాదనియు, పూర్వ పూర్వజంతుశరీరనిర్మాణపరిణామములఫల మనియు వీరు భావించుచున్నారు. ఇట్లచేతన మగుదేహనిర్మాణమునకు నింతగా పూర్వపూర్వకారణస్థితిని స్థాపింప యత్నించునట్టి వీరు బహుప్రభావమహిత మైనజీవశక్తి మాత్రము నిర్హేతుకముగ దేహముతోఁ బుట్టి, నిష్ఫలముగ దేహముతో నశించు నని చెప్పుట కడువిచిత్రము.

## శరీర మొకయంత్రమువంటిది

(19) భౌతిక మై యచేతన మైనశరీరమునందు సుఖదుఃఖసమన్వితుఁడు, అహంకారమమకారాత్మకుఁడు నయినజీవుఁడు పుట్టు నని చెప్పుట మిక్కిలి యసంబద్ధము. కేవలశరీరమునకు చైతన్యము లేదనుట మృతశరీరమునందు ప్రత్యక్షము. శరీరము కదలుచున్నప్పుడు చేతనశక్తి శరీరమునకు నైజమా? లేక యంతర్గతుఁ డగుజీవునకు సంబంధించినదా? యను సందేహము కలుగుట సహజము. యంత్రము పని చేయుచున్నప్పుడు, దానికదలికయు, శబ్దాదికమును కేవల మినుపసాధనమువలన సంభవించినట్లే

యజ్ఞులు భ్రమింపవచ్చును. కాని విజ్ఞు లగువారు యంత్రము తనయంతట తాను గాక దానియందుఁ బ్రసరింపఁజేయఁ బడిన నీటియావిరిశక్తివలనఁ గాని, విద్యుచ్ఛక్తివలనఁ గాని, పనిచేయుచున్న దని గుర్తింతురు. ఇట్లే శరీరము తనయంతట తాను కదలుచున్నట్లు కన్పించుచున్నను, దానిని నడపునట్టి జీవశక్తి దానికి భిన్నమై విద్యుచ్ఛక్తి వలెనే, సూక్ష్మరూపమున నదృశ్యమై శరీరము నంతను వ్యాపించి దానిచేత పని చేయించుచున్న దని గుర్తింపవలసి యున్నది. కావున గాజుగోళకము (Bulb) భగ్నమైనను భంగము నొందనివిద్యుచ్ఛక్తివలె శరీరము భగ్నమైనను జీవుఁడు భంగము నొందక దానినుండి వెల్వడి లోకాంతర జన్మాంతరములను పొందుచుండును.

## అచేతనమునుండి చైతన్యము పుట్టదు

(20) కాని జీవచైతన్యము శరీరధర్మ మనియు, దానితోడనే నశించు ననియు పలువురు వాదించుచుందురు. ఇది సరికాదు. శరీర మచేతనము. అచేతనమునుండి చైతన్యము కల్గుట యసంబద్ధము. చేతనులైనతల్లిదండ్రుల నుండియే చేతనుఁడైనమానవుఁడు జన్మించుచున్నాఁడు. మృతశరీరములవలన నెవరును జన్మించుట లేదు. కట్టెలు, రాళ్లు మొదలగువానినుండి చేతనులైనజీవులు సంభవించుట లేదు. అట్లు కాదు. రాళ్లు మొదలగువానికి చైతన్యోత్పాదనశక్తి లేకపోయినను శరీరపరమాణువుల కట్టివిశిష్ట మగుశక్తి కల దని చెప్పవచ్చును అయినచో నాపరమా

ణువుల కాశక్తి సహజమా? లేక యాగంతుకమా? సహజమైనచో నది వానియం దెల్లప్పుడు కన్పింపవల యును. ఏది దేనికి సహజధర్మమో యది యావస్తు వుండగా నశింపదు. అగ్ని యుండగా నుష్ణము నశింపదు. ఉష్ణము లేనియగ్ని యుండదు గదా? కావున శరీరపరమాణువులకు చైతన్యము సహజమైనచో మృతశరీరమునందును నవి కలవు గావున చైతన్యము నైత ముండవలయును. కాని యట్లు సంభవించుట లేదు. కావున చైతన్యము శరీరపరమా ణువులకు సహజము కాదు. అట్లయినచో నాగంతుక మని చెప్పవచ్చును. వానియం దొకవిధమైనసంయోగము కలిగి నపుడు చైతన్యము కలిగి వానికి వియోగము కలిగినంతనే నశించుచున్నది. వక్క, ఆకు, సున్నము కలిసి తాంబూల మైరక్తిమ, ఉష్ణము కలిగినట్లే యనేకపరమాణువులసం యోగముచే చైతన్యము కలుగుచున్నది. ఈదృష్టాంత మస మంజసము. వక్క, ఆకు, సున్నము మొదలగునవి యచేత నములు. వానినుండి యచేతనము లగురక్తిమోష్ణముతే కలుగుచున్నవి. చైతన్యము పుట్టుట లేదు. అచేతనపదార్థము లెన్నిసంయుక్తము లైనను చేతనపదార్థము పుట్టు ననుట కాధారము లేదు. కావున నచేతనపరమాణుసంయోగము వలన చైతన్యము పుట్టు ననుట యసంగతము. కావున చైతన్యము శరీరధర్మము కా దని చెప్పవలసియున్నది.

## దేహావస్థలనుగుర్తించుజీవుఁడు దేహాభిన్నుఁడు

(21) సాక్షిత్వముచేత నైతము జీవచైతన్యము శరీరముకన్న భిన్న మని గ్రహింపవలసియున్నది. సాధా

రణముగఁ బ్రతివ్యక్తియును తనబాల్యయౌవనవిశేషము లను స్మరించి చెప్పఁగలుగుచున్నాఁడు. చైతన్యము శరీర ధర్మమైనచో ననుభవమును దానిధర్మమే యగును. కాని బాల్యమునం దున్నశరీరము యౌవనమునకు నిలుచుట లేదు. బాల్యానుభవములను స్మరించుటకు నప్పటిశరీరమే యుండ వలయును. ఎవఁ డేవస్తువును పూర్వము చూచి యున్నాఁడో వాఁడే మఱియొకప్పుడు దానిని స్మరింపఁ గలడు. ఒకఁడు చూచినవస్తువును మఱియొకఁడు స్మరించుట సంభవింపదు. బాల్యశరీర మిప్పుడులేదు, కావున నప్పటి విషయముల నిప్పటిశరీరము స్మరించుట యసంభవము. అట్లు కాదు. శరీర మంతయు మాఱుచుండుట లేదు. దాని యందలి యంతఃకరణము బాల్యమునుండియు నిప్పటివఱ కును గలయనుభవములను గుర్తించుచున్నది. ఏయంతఃకర ణము బాల్యమున ననుభవముల నందినదో యదియే యిప్పుడు స్మరించుచున్నది. అట్లయినచో నీయంతఃకరణము శరీరము కంటె భిన్నమా? లేక యభిన్నమా? అది శరీరమం దభిన్న మైనయొకభాగము. అయినచో శరీర మంతయు పరిణమిం చుచుండగా నిది మాత్రము పరిణమింపకుండుటకు హేతు వేమి? అది దానిస్వభావము. అట్లగుచో శరీరముతోపాటు పరిణమింపనియీయంతఃకరణము శరీరముతోపాటు నశించు నని యెట్లు చెప్పవచ్చును? నశింపకపోవచ్చును. అట్లయినచో నది శరీరభాగము కానేరదు. ఈయంతఃక రణచైతన్యమునే మేము జీవుఁ డని చెప్పుచున్నాము.

## సంస్కారములతారతమ్యమునకుఁ బూర్వ జన్మకర్మలే హేతువులు

(22) సంస్కారముల తారతమ్యము చేతను జీవుఁడు స్వతంత్రుఁ డని వానికర్మానుసారముగనే దేహేంద్రియాదు లేర్పడుచున్న వని చెప్పవలసియున్నది. ఒకఁడు జన్మసిద్ధముగనే మేధావి యగుచుండఁగా మఱియొకఁడు మేధాహీనుఁ డగుచున్నాడు. ఇతరులకు బహుపరిశ్రమాభ్యాససాధ్యము లైనకవిత్వసంగీతచిత్రలేఖనాదులందు బాల్యముననే కొంద ఱనల్ప మగుప్రతిభను ప్రకటించుచున్నారు. ఈ తారతమ్యమునకు హేతు వేమి? వర్ణము, ఆకృతి మొదలగునవి శరీరమునకు సహజముగ నెట్లేర్పడుచున్నవో యట్లే మస్తిష్కములోని నాడీసంయోగవిశేషములచే మేధావిత్వాదులు నేర్పడుచున్నవి. ఈనాడీసంయోగవిశేషమునకు హేతు వేమి? తల్లిదండ్రులయొక్క, పూర్వులయొక్కయు శరీరధర్మపరిణామముగ నది యేర్పడుచున్నది. అట్లయినచో మేధావులకు మేధాహీనుఁడును, మేధాహీనులకు మేధావులును జన్మించుచుండుట చూచుచుంటిమి కదా! అది యెట్లు సంభవించును? అట్టియెడల తాతముత్తాతల సంస్కారములును కారణము కావచ్చును. ఈపూర్వులసంస్కారము లన్నియు తల్లిదండ్రులయందుండియే కదా సంతానమునకు సంక్రమించును? మఱి తల్లిదండ్రులు సమానముగ నుండఁగా కవలపిల్లలయందే యొకనికి నొకవిధ మైనసంస్కారములు మఱియొకనికి

మఱి యొకవిధ మైనసంస్కారములు నెట్లు కలుగుచున్నవి? అదిస్వృష్టిధర్మము. అనఁగా నిష్కారణ మన్నమాట. అవును; సృష్టియందు సర్వజంతువులు నెట్లో పుట్టి నశించుచున్నవి; సృష్టియొక్క ధర్మమే యట్టిది. అట్లగుచో సృష్టియందు కారణము లేకయే కార్యము కలుగుచున్న దన్నమాట. అట్టియెడల మామిడిచెట్టు కావలసినవాఁడు మామిడి గింజలే వేయ నక్కఱ లేదు. చింతగింజ కైనను మామిడి చెట్టు పుట్టవచ్చును. ఇది యసంగతము. సృష్టియం దేదియు నిర్హేతుకముగ సంభవించుట లేదు. తగిన కారణ సామగ్రి యున్నప్పుడే కార్యములు సంభవించుచున్నవి కావున సంస్కారతారతమ్యములు సైతము నిర్హేతుకము లనుట యసంబద్ధము. చెట్టును జూచి దానికి హేతు వగు బీజము నూహించుచున్నట్లే యిప్పటిసంస్కారములనుబట్టి వానికి హేతువు లగుపూర్వజన్మసంస్కారముల నూహింప వలసియున్నది. కావున జీవుఁడు శరీరముతోపాటు నశింపక యప్పటిసంస్కారములతో నూతనశరీరమును పొందు చున్నాఁడు.

## కర్మ నిష్ఫలము కాదు

(23) జన్మసిద్ధ మగునీసంస్కారములతారతమ్యము నిష్కారణము కా దనియు, జీవులపూర్వజన్మకర్మలవలన వారి కిప్పటిశరీరేంద్రియమనోబుద్ధివిశేషము లేర్పడు చున్న వనియు శాస్త్రము లుద్ఘోషించుచున్నవి. నేఁటిజన్మము పూర్వజన్మకర్మకు ఫలము. అట్లే నేఁటికర్మము భావిజన్మ మునకు హేతు వగును. కావున నేకర్మయును నిష్ఫలము

కాఁజాలదు. జీవునిజననమరణములకు, సుఖదుఃఖములకు వానికర్మమే కారణ మగుచున్నది. ఈకర్మసిద్ధాంత మంగీకరించిననే తప్ప సృష్టివిధానమును సమన్వయించుటకు వీలు కాదు. దీని నంగీకరించినచోఁ బ్రకృతిశాస్త్ర సిద్ధాంతములలోఁ బ్రధానసూత్ర మగుశక్తినాశసిద్ధాంతము (Law of Conservation of energy) సైతము సక్రమముగా సమన్విత మగును. ఒకశరీరమున డెబ్బది యేనుబది యేండ్లకాలము పనిచేసిన బుద్ధీంద్రియశక్తులు శరీరపాతమాత్రముననే నిష్ఫలమై నశించిపోవు నని నిర్ణయించుటకు కా నక్కఱ లేదు. బుద్ధీంద్రియాత్మకుఁడైనజీవుఁడు శరీరపాతమున నశింపక కర్మానుసారముగ దేహాంతరమును పొందును. దీనివలనఁ బుణ్యపాపకర్మలును సఫలము లగును. పుణ్యమువలన నుదాత్తము లగుమానవాదిజన్మలును, పాపమువలనఁ గ్రిమికీటకాదిజన్మలును గలుగు నని గ్రహింపఁదగును.

## అప్రత్యక్షవిషయములందు ఆప్తవాక్యము ప్రమాణము

(24) ఈ కర్మసిద్ధాంత మెంతసహేతుకముగ నున్నను శరీరముకన్న భిన్నుఁడగుజీవుఁడు కన్పించుచుండుట లేదు, కావున నమ్మఁజాల మని కొందఱందురు. అట్టియెడలఁ దక్కినశాస్త్రవిద్యాభ్యాసాదివిషయములందుఁ బ్రత్యక్షముగఁ జూచి గ్రహించుటకు వీలు లేని యంశములను చూచి తెలిసికొనియున్నవానివలన నివి

కాని నెట్లు యథార్థములుగ గ్రహించుచున్నామో, యట్లే
శ్రీ వురివిషయమునను చూచి చెప్పినవారి వాక్యములను
ప్రమాణముగ గ్రహింపవలసియున్నది. అట్లయినచో
శ్రీకృష్ణుడు కలఁడని చెప్పినవారు కొంద ఱున్నట్లే లేఁడని
చెప్పువారును మఱికొందఱు కలరు, కావున నేపక్షము
నైనను ప్రమాణముగ గ్రహింప నక్కఱ లేదని శంక కలు
గవచ్చును. కాని యన్నివ్యవహారములయందు వలెనే, దీని
యందును రెండుపక్షములను పరిశీలించి సమంజస మైన
దానిని స్వీకరించుట న్యాయము. అర్జునునిసందేహములకు
సమాధానము చెప్పుచు శ్రీకృష్ణుఁ డిట్లనెను. "నాకును
నీకును చాలజన్మలు గడచిపోయినవి. వాని నన్నింటిని నే
నెఱుంగుదును; నీ వెఱుంగవు."

[श्लो. बहूनि मे व्यतीतानि, जन्मानि तव चार्जुन ।
तान्यहं वेद सर्वाणि, न त्वं वेत्थ परंतप ॥
- भ. गी. अध्या. 4 - श्लो. 5]

## బహుదేశకాలభిన్నదర్శనసమ్మతము

(25) శ్రీకృష్ణునివాక్యము పౌరాణిక మగుటచే
వ్యాసకల్పిత మై యుండవచ్చు ననియు, కేవల మప్ర
త్యక్ష మైనవిషయమున నెప్పుడో యొకానొకఁడు చెప్పిన
మాటను పరమప్రమాణముగ నంగీకరింప నక్కఱ లేదని
శంక యుదయింపవచ్చును. కాని యొకకాలమునం దొకా
నొకఁడు మాత్రమే యిట్లు చెప్పుట గాక, బహుదేశము

లందు భిన్న కాలములందును విద్యావిజ్ఞానసంపన్నులు తత్త్వదర్శనులు నగుమహనీయు లనేకులు జీవునియ స్థిత్వమును గూర్చి నిస్సందిగ్ధముగఁ బ్రకటించియుండిరి. వేదమతము నకు సంప్రదాయముచే భిన్నుఁ డగుగౌతమబుద్ధుఁడు సైతము శరీరము క్షణభంగుర మని, జీవుఁడు నిత్యుఁ డనియుఁ బ్రబోధించెను. అతఁడు తనజన్మాంతరములను గూర్చి చెప్పినకథలే జాతకకథ లయ్యె ననుట ప్రసిద్ధ మగువిషయము. ఏసుక్రీస్తు, మహమ్మద్ ప్రవక్త మొదలగు భిన్నమతకర్తలును జీవునియ స్థిత్వమునుగూర్చి నిస్సందేహముగ బోధించియుండిరి. ఆధునిక లగు రామకృష్ణ వివేకానందరమణారవిందులు జీవాస్తిత్వమును దృఢముగఁ బ్రబోధించిరి. రామకృష్ణుఁ డనేకపర్యాయములు తన శిష్యులపూర్వజన్మలఁగూర్చి ప్రసంగించెను. వివేకానందుఁడు సైతము తనకు కొన్నిపిశాచములు కన్పించుచుండె నని, వానిపిశాచత్వనివృత్తికై చెన్ననగరమున సముద్ర తీరమున నిసుకపిండములను వేసె ననియు తర్వాత మరల నవి కన్పింప లే దనియు చెప్పియుండెను. (పుట. 246. శ్రీ వివేకానందచరిత్ర - శ్రీ చిరంతనానందస్వామి విరచితము). మఱియొకప్పుడు నివేదితతో ప్రసంగించుచు, మహాపురుషులకు పూర్వజన్మజ్ఞాన ముండు నని, తనకును పూర్వజన్మజ్ఞానము కల దనియు నాతఁడు తెలిపియుండెను. (పుట. 263. శ్రీ వివేకానందచరిత్ర - శ్రీ చిరంతనానంద స్వామి విరచితము), ఇట్లొకకాలమునందు, ఒకదేశము నందు, ఒకమతసంప్రదాయములు విశ్వసించిన వారు

మాత్రమే గాక యత్యంతప్రాచీనకాలమునుండియు, భిన్న దేశములందు, భిన్నకాలములందు, భిన్నమతసంప్రదాయానుయాయులు తత్త్వదర్శనులు నగుమహాత్ము లేక గ్రీవముగ జీవునియస్తిత్వమును ప్రబోధించియుండుటచే నదియే సిద్ధాంత మని గ్రహింపవలసియున్నది. ఒకకాల మం దొకనికి భ్రాంతి యుండవచ్చును గాని భిన్నకాలీను లైనమహాత్ముల కందఱకు భ్రాంతి గల్గుట యసంభవము. మఱియును మొట్టమొదట నాస్తికవాదము నవలంబించుచు శ్రీరామకృష్ణుని సేవాభాగ్యమునఁ దత్త్వదర్శనము నొంది జీవాస్తిత్వమును, పరమేశ్వరప్రాభవమును జక్కఁగా గ్రహించి లోకమునకుఁ బ్రబోధించిన వివేకానందుని జీవితమే సకలనాస్తికవాదపాదపకుఠార మని చెప్ప వచ్చును.

## దర్శనహీన మగుమాట ప్రమాణము కానేరదు

(26) శరీరభిన్నుఁ డగుజీవుఁడు లేఁ డని చెప్పినవారును గొందఱు కలరు గదా యని సంశయము కలుగ వచ్చును. కాని యొకవస్తువునుగూర్చి నేను చూచియుంటి నని యొకఁడు చెప్పుచుండఁగా, అట్లు చూచుటకు సామర్థ్యము లేకయే నాకు కన్పించుట లేదు గావున నది లేనే లేదని చెప్పుట యాతనియవివేకనాస్తిత్వమునే ప్రకటించును గాని వస్తునాస్తిత్వమును స్థాపింపదు. కావున నాత్మస్వరూప మెఱుంగక కేవల మాభాసహేతువులతో జీవుఁడు లేఁడు దేవుఁడు లేఁ డని చెప్పువారిమాటల కెట్టి

ప్రాముఖ్యమును లేదని గ్రహింపవలసి యున్నది. ఈ విషయమున వివేకానందుఁడొసంగినసమాధానమును గుది వాక్యమునుగా మనము భావింపవచ్చును. చికాగోలో జరిగినప్రపంచమత మహాసభలో "హిందూధర్మము" ను గూర్చి చదివినవ్యాసమునం దాతఁడిట్లుద్ఘాటించెను. "వీనినన్నిఁటి నంగీకరించినను, నాపూర్వజన్మవిషయ మేమి యును నేను స్మరింపకుండుట యెట్లు సంభవించుచున్నది? దీనిని సులభముగ వివరింపవచ్చును. నే నిప్పు డాంగ్లమున మాటాడుచుంటిని. ఇది నాకు మాతృభాష కాదు. నిజ మునకు నాచిత్తవృత్తియం దిప్పుడు నామాతృభాషలోని పదము లేవియును స్ఫురించుట లేదు. కాని వానిని స్మరింప యత్నించినచో నవి ప్రవాహమువలెఁ బొంగి వచ్చును. దీనివలనఁ జిత్తవృత్తి మనస్సముద్రమునకు నుపరి తలమాత్రమే యని, దానియడుగున మనయనుభవము లన్నియు రాశీభూతములై యున్న వనియు వ్యక్తమగు చున్నది. యత్నింపుడు. పోరాడుడు. అవి పైకి రాగలవు. మీపూర్వజన్మములఁగూర్చియు మీ రెఱుంగఁగలరు.

ఇది ప్రత్యక్ష మగుదృష్టాంతపూర్వక సాక్ష్యము. అను భవముతో సమన్విత మగుటయే సిద్ధాంతమునకు సముగ్ర మగునుపపత్తి; ఈవిషయమున మహర్షు లిట్లు ప్రపంచము నకు సవాలు చేయుచున్నారు. స్మృతిసముద్రగర్భము నందలి యట్టడుగువిషయములను సైతము మథింపఁగల రహస్యమును మేము కనుగొంటిమి; ప్రయత్నింపుడు, మీరును సంపూర్ణ మగుపూర్వజన్మస్మృతిని పొందుదురు."

[Taking all these for granted, how is it that I do not remember anything of my past life. This can be easily explained. I am now speaking English. It is not my mother tongue, in fact no words of my mother tongue are now present in my consciousness, but let me try to bring them up, and they rush in. That shows that consciousness is only the surface of the mental ocean, and within its depths are stored up all our experiences. Try and struggle, they would come up and you would be conscious even of your past life

This is direct and demonstrative evidence. Verification is the perfect proof of a theory, and here is the challenge thrown to the world by the Rishis. We have discovered the secret by which the very depths of the ocean of memory can be stirred up - try it and you would get a complete remeniscence of your past life.

— Page 7. "Paper on Hinduism."
Part I. "The complete works of The Swamy Vivekananda". 6th edition]

కావున శాస్త్రవాక్యములవలన శాస్త్రీయ మగు హేతువాదమువలన, మహాత్ములయనుభవప్రామాణ్యము వలనను జీవునకు జన్మాంతరములు, లోకాంతరములు కలవని, పూర్వజన్మకర్మవలన నిప్పటిశరీరము లభించినట్లు, యిప్పటికర్మలవలన భావిజన్మము లభించు ననియు నిస్సందేహముగ గ్రహింపవలసియున్నది,

## పుణ్యపాపఫలము లగుజన్మాంతర లోకాంతరములు కలవు

(27) పైవిచారణమువలన విషయ మి ట్లేర్పడు చున్నది. ఈలోకమే యాయతనము కాదు లోకాంతరములు, జన్మాంతరములు కలవు. దేహ మాత్మ కాదు. దానికి వస్త్ర మెట్టిదో యది యాత్మ కట్టిది. దేహము జీవునకు సాధనమాత్రము. దేహేంద్రియములతో కర్మ లాచరించుజీవుఁ డుత్తమాధమలోకములను జన్మములను పొందుచుండును. వీనికి పుణ్యపాపములు మూలము. వానికి ధర్మాధర్మములు మూలము. కావున నధర్మములకు తొలఁగి ధర్మమునే పాటించుచు లౌకికాభ్యుదయముల నుత్తమ జన్మలను పొందుచుఁ గ్రమముగఁ బరమసుఖరూప మగు పరమాత్మప్రాప్తి యనుపరమపురుషార్థమును పొందుటయే మానవజీవితమునకుఁ బరమలక్ష్యము.

## సమానార్థికసంపన్నత సకలసమస్యలను బరిష్కరింపదు

(28) ఆర్థికముగ, సాంఘికముగ, రాజకీయముగ నౌన్నత్యము గలుగుట కందఱకు సమానావకాశములు కలిగించినచో సకలసమస్యలు పరిష్కారము నొంది యెల్ల రకును సుఖశాంతు లేర్పడఁగలవు; కావున నట్టిరాజకీయార్థికవిధానములకొఱకే కృషి చేయుట పరమార్థ మగును; కాని తక్కినపుణ్యకార్యపరత్వము వ్యర్థ మని

కొందఱు చెప్పుదురు. దీనియందు రెండంశములు కలవు. ఎల్లరకును సమానావకాశములు కలిగించినచో సమాన సుఖసంపదలు కలుగు ననుట మొదటిది. లౌకిక మైనయాన్నత్యమువలన సంపూర్ణ మగుశాంతి లభించు ననుట రెండవది. ఇవి యవిచారరమణీయములే గాని యథార్థములు గావు. వైషమ్యము సృష్టియందు సహజమై యుండగా సమానావకాశములు గూర్చినచో వైషమ్యమే ఫలించును గాని సమానత్వము ఫలింపదు. మఱియు నేదే నొకవిధానముచేత నొకప్పటికి, నందఱకును సమానముగ సంపన్నత కలుగునట్లు వ్యవస్థ నొనర్చినను, అది చిరస్థాయిగ నుండుననుట కవకాశము లేదు. తెలివితక్కువవాఁడు తనకున్నదానిని గోల్పోయి హీనుఁ డగుటయు, తెలివిగలవాఁడున్నదానిని పెంపొందించుకొని యధికుఁ డగుటయు సంభవించును. ఏయార్థిక రాజకీయవిధానములును జన్మసిద్ధము లైనబుద్ధిశీలాదితారతమ్యములను నిర్మూలించు నని చెప్పఁజాలము. సంపదలు, సౌకర్యములు పుష్కలముగ నున్నయున్నత కుటుంబములందు బుద్ధిహీనులు, శీలభ్రష్టులు సంభవించుట, దరిద్రులయిండ్లయందు మేధావులు, మహాపురుషులు జన్మించుటయు లోకమున సంభవించుచునే యున్నది. కావున నార్థిక రాజకీయాదివిధానములచేతనే సకలసమస్యలును పరిష్కారము నొందు ననుకొనుట భ్రమ. సృష్టియందు వైషమ్యము సహజమైనను సాధ్యమైనంత వఱ కెల్లరకు సమానముగ సుఖసంపదలు కలుగునట్లు ప్రయత్నించుట మానవుల కెప్పుడును కర్తవ్యమే యగును.

కాని యీ ప్రయత్నమునే సర్వస్వముగ భావించి ధర్మకర్మలను నిరాకరించుటకు వీలు లేదు.

## సంపన్నతయే సమగ్రశాంతి నొసంగదు

(29) లౌకిక మైనయౌన్నత్యముచేతనే మానవులకు సంపూర్ణ మగుశాంతి లభించు ననుటయు నిశ్వాసార్హము గాదు. సకలవిధము లగునౌన్నత్యములను పొందుచుండిన ప్రాచీను లగుమహారాజులు గాని నేఁటిరాజకీయనాయకులు గాని సంపూర్ణ మగుశాంతి ననుభవించుచుండిరని చెప్పుట కవకాశము లేదు. రావణదుర్యోధనులు సంపన్నులై యుండియే సంతృప్తి నొందక దురాచరణములకుఁ బాల్పడిరి. ఆధునిక రాజకీయచరిత్రలలో నిరంకుశులైననాయకు (Dictators) లిట్టివారే. సంపన్నులు సంతృప్తి నొందక కామక్రోధములకు, లోభమోహములకు లోనై వర్తించుటయే సాహిత్యమునం దనేకకథలకు బీజము. షేక్స్పియర్ నాటకకథలన్నియు దీనిపైననే యాధారపడియున్నవి. సంపన్నత సుఖమున కొకసాధనమే గాని, సుఖస్వరూపము కాదు. కామక్రోధాదులచేఁ బీడింపఁబడుచున్నవానికి సంపద లెన్నియున్నను సుఖహేతువులు కానేరవు. కామక్రోధాదులను జయించినవారికి సంపదలు లేకున్నను సుఖశాంతులు కొఱవడవు. ప్రతిదేశమునందును ప్రసిద్ధ మైయున్నసాధుపరివ్రాజకజీవన మిందులకు నిదర్శనము. కావున మానవునిమనశ్శాంతికి కామక్రోధలోభమోహాదినిగ్రహ మత్యంత మావశ్య

కము. దీనిని సాధించుటకే సకలమతధర్మములును ప్రవర్తించుచున్నవి. ఈకారణముచే నెట్టియాదర్శప్రాయమైనసాంఘికవ్యవస్థయైనం దైనను ధర్మవిశ్వాసము లావశ్యకములే యగును. లౌకికోన్నతికిని, మనశ్శాంతికిని గల తారతమ్యము ప్రహ్లాదునిమాటలయందే మనము చక్కఁగ గ్రహింపవచ్చును. తండ్రి లౌకికౌన్నత్యమే పరమార్థమనువాఁడు. కుమారుఁడు సర్వలోకసుఖములయం దనాసక్తుఁడు. అట్టి తండ్రికిఁ గుమారుఁడొసఁగినసమాధానము నెల్లరును సందేశముగ గ్రహింపఁదగియున్నది.

"ఉ. లోకము లన్నియున్ గడియ
లోన జయించినవాఁడ వింద్రియా
నీకము చిత్తమున్ గెలువ
నేరవు నిన్ను నిబద్ధుఁ జేయునీ
భీకరశత్రు లార్వురఁ బ్ర
భిన్నులఁ జేసినఁ బ్రాణికోటిలో
నీకు విరోధి లేఁ డొకఁడు
నేర్పునఁ జూడుము దానవేశ్వరా!"

— ఆంధ్రమహాభాగవతము. సప్తమస్కంధము.

కావున లౌకికము లగుసంపదలును, సౌకర్యములును మన కెంతయావశ్యకము లైనను, అవియే సకలసమస్యలను పరిష్కరించు నని తలంచుట భ్రాంతియే యగును. సమగ్ర మగుమనశ్శాంతికి ధర్మకర్మములును, భక్తిత్యాగవైరాగ్యములు నత్యంత మావశ్యకములు. మఱియు

వీనివలనఁ బొందఁదగినపరమసుఖరూప మగుపరమాత్మ ప్రాప్తియే పరమపురుషార్థ మనియుఁ గుర్తింపవలసి యున్నది.

## పరమాత్మప్రాప్తియే పరమపురుషార్థము

(30) ఎప్పుడో పరమాత్మప్రాప్తివలనఁ బరమ సుఖము లభించు ననుపేరాసతో నిప్పటిసుఖభోగములను వదలుకొనుట మే లెట్లగును?; మఱియు నాపరమాత్మ ప్రాప్తి పరమసుఖ మని యెట్లు చెప్పవచ్చును? - అని కొందఱు శంకింతురు. కాని వివిధదేశములందు, వివిధ కాలములందును, విద్యావివేకసహితు లగుమహాపురుషు లనేకులు సంసారముల నుజ్జగించి దేహసుఖముల నుపే క్షించి భక్తితపోయోగాదిపరు లై పరమాత్మప్రాప్తి నొంది పరితోషము నొంది యుండిరి. ప్రాచీను లైనమహా యోగులు గాక బమ్మెరపోతన, త్యాగరాజాదులును, శ్రీరామకృష్ణవివేకానందరమణారవిందులు నిట్టిపరమాత్మ ప్రాప్తి పరమసుఖ మనుటకు, పరమపురుషార్థ మనుటకును ప్రబలనిదర్శన మగుచున్నారు. ఇట్టిమహనీయుల సంసార పరాఙ్ముఖత, పరమేశ్వరభక్తిపరత్వమును, కేవల మవివేక మూల మనియు, దేహోపభోగమే పురుషార్థ మనియు వాదింపఁ బూనుట యజ్ఞానప్రకటనము మాత్ర మే యగును. కావున మహానందరూప మగునేపరమాత్మప్రాప్తికై వివే కానందాదిమహనీయులు కామకాంచనపరాఙ్ముఖు లై వర్తించిరో యట్టిపరమాత్మప్రాప్తియే మానవులకు పరమ పురుషార్థ మని చెప్పవలసియున్నది.

## శ్రీరామచంద్రాదులే ఆదర్శప్రాయులు

(31) ఇట్లనుటవలన లౌకికజీవనాభ్యుదయవికాసముల నుపేక్షించినట్లుగఁ దలంప నక్కఱ లేదు. ధర్మము లౌకికసుఖభోగములను నిషేధింపదు; నియమించును. అర్థకామములను భారతీయులు పురుషార్థములుగనే భావింతురు. ధర్మమున వర్తించుచు నర్థకామములను జక్కఁగా సమకూర్చుకొనవచ్చును. వ్యక్తివర్తనమునకు, కుటుంబజీవనమునకు, సామాజికకార్యకలాపములకు ధర్మమే మార్గదర్శకము. ధర్మనిష్ఠులై యేకార్యరంగమునందైన నెంతటియౌన్నత్యము నైనను సాధింపవచ్చును. ధర్మాత్ములు, లోకసంగ్రహపరాయణులు, కార్యదక్షులు నగుశ్రీరామచంద్రాదులే భారతీయుల కాదర్శపురుషులు. అర్థకామములకు, పరమాత్మప్రాప్తికి ధర్మము నేకైకమార్గముగ గుర్తించుటయే భారతీయులవిశిష్టత. ధర్మదృక్పథమే భారతీయసంస్కృతి.

## ధర్మవైవిధ్యము

(32) ఈధర్మము వ్యక్తికుటుంబసమాజవిశేషములచే భిన్నమగుచున్నది. పురుషార్థ మొకటియే యైనను తత్ప్రాప్తికి భిన్నమార్గము లుండుట సహజము. ప్రతి వ్యక్తికిని వానికి సహజము లగుగుణవిశేషములఁబట్టి, కుటుంబపరిస్థితులఁబట్టి, వయోభేదమూలమున కర్తవ్యమగుధర్మము వివిధ మగుచుండును. ఒకవిషయమునే బోధించుటకు గ్రహణశక్తియందుఁ దారతమ్యము గల

విద్యార్థులకు భిన్నబోధనమార్గములే యోగ్యము లగునట్లు, భిన్నగుణవిశిష్టు లగుమానవులకుఁ దగ్గుశోచితము లగుధర్మ కర్మములే యోగ్యము లై యుండును.

## జాతిభేదముచే ధర్మభేదములు

(33) మానవు లందఱును సమానముగ జన్మించుచున్నారు, కావున దేనియం దైనను భేదమును పాటించుట యన్యాయ మని కొంద ఱందురు. కాని యిది యథార్థము కాదు. సర్వసమత్వము సృష్టియందసహజము. ఏయిద్దఱు వ్యక్తు లైనను కొలదిభేదము నైన కలిగియుందురు. భిన్నత్వము సృష్టికి సహజధర్మము. జాతిభేదము జన్మసిద్ధము. వృక్షములకన్న జంతువులు, వానికన్న పక్షులు, వానికన్న మానవులు జన్మముచేతనే భిన్ను లగుచున్నారు. ఒక జాతియందును, అవాంతరభేదము లనేకములు జన్మము చేతనే యేర్పడుచున్నవి. పక్షిజాతియందే కాకులకన్న గ్రద్దలు, వానికన్నను చిలుకలు, వానికన్నను పావురములు భిన్నము లగుచున్నవి. వానిజీవనవిధానములును భిన్న మనుట ప్రత్యక్షము. ఒకజాతికి సహజ మైనజీవన విధానము, మఱియొకజాతికి సహజము కానేరదు. కావున జన్మసిద్ధ మగుజాతినిబట్టి యేది సహజ మగునో యట్టి జీవనవిధానమే దానికి నుచిత మగును. అదియే దానికి నభ్యుదయహేతు వగును. ఏవిధానముచే నేజాతికి సమ్యగ్జీవన మేర్పడునో యదియే దానికి ధర్మ మగును. ఒకజాతి కొకవిధానము ధర్మ మైనచో మఱియొకదానికి వే ఱొకటి

ధర్మ మగుట సహజము. దీనివలననే మతభేదములును ఏర్పడుచున్నవి. దేశకాలభేదములవలెనే యివియును సహజములు. ఈజాతిమతధర్మభేదములు పోయి యందఱకు నొక జీవనవిధానమే యేర్పడుట యసంభవము. పరస్పర మతధర్మద్వేషమునకు సంఘర్షణమునకు నవకాశ మొసంగక, సామరస్యమును బెంపొందించుచు, స్వమతధర్మముల నవలంబించు చుండుటయే ప్రతిజాతికిని కర్తవ్యము. ఈవిషయమున వివేకానందునియభిప్రాయమును గమనింపుఁడు. చికాగోలో జరిగినప్రపంచమతమహాసభలో నాతఁ డిట్లుద్ఘాటించెను. "విత్తనము భూమియం దుంచఁబడినది. దానిచుట్టును మట్టి, గాలి, నీరును గలవు. అది మట్టి గాని, గాలి గాని, నీరు గాని యగుచున్నదా? అ ట్లగుట లేదు. అది మొక్క యగుచున్నది. అది తనకు సహజమైన యభివృద్ధివిధానమునుబట్టి పెరుగుచున్నది. తనచుట్టును గలమట్టిని, గాలిని, నీటిని స్వీకరించి, వానిని వృక్షపదార్థముగా మార్చుకొనుచు నది మొక్కగా నెదుగుచున్నది.

మతవిషయమును నిట్టిదియే. క్రైస్తవుఁడు, హిందువుగాఁ గాని బౌద్ధుఁడుగాఁ గాని కానక్కఱ లేదు; హిందువుఁడు గాని బౌద్ధుఁడు గాని క్రైస్తవుఁడు కానక్కఱ లేదు. కాని యొక్కొక్కఁడును నితరుల తత్త్వమును జక్కఁగా గ్రహించుచుండియు తనవ్యక్తిత్వమును నిలువఁబెట్టుకొనవలయును. తనయభివృద్ధివిధానము ననుసరించి తాను వృద్ధి నొందవలయును."

["The seed is put in the ground, and earth and air and water are placed around it. Does the seed become the earth, or the air, or the water? No. It becomes a plant, it develops after the law of its own growth, assimilates the air, the earth, and the water, converts them into plant substance, and grows into a plant.

Similar is the case with religion. The christian is not to become a Hindu or a Buddhist, nor a Hindu or a Buddhist to become a christian. But each must assimilate the spirit of the others and yet preserve his individuality and grow according to his own law of growth,"

—P. 22. Part I. "The complete works of the Swami Vivekananda" 6th edition].

## మర్యాదాపాలనము

(34) దేశకాలభేదములవలననే భిన్నము లగునాచారములు మర్యాదలును ఏర్పడుచున్నవి. సమాజ మగునీ భిన్నత్వమును తారతమ్యమును కొందఱు గుర్తింప నిరాకరింతురు; సమానత్వమును భావించుచుండుటయే సమంజసమని తలంచుచుందురు. కాని యిది యసమాజమగుటచే నసమంజసము. దేశకాలభేదరహితమైనసృష్టి యసంభవము. అట్టిసమత్వము ప్రళయమునందు మాత్రమే సంభవించును. సృష్టియందు భేదము తప్పదు. కాలమే మొదటి

భేదకము. నిన్న పుట్టినవాఁడు పెద్దవాఁడు, నేఁడు పుట్టినవాఁడు చిన్నవాఁడు నగుచున్నాఁడు. కావున నున్న భిన్నత్వమును తారతమ్యమును గుర్తించి వాని కుచితమై శ్రేయస్కర మగుమార్గమున వర్తించుటయే మర్యాదను పాటించుట. కుటుంబధర్మము లన్నియు నిట్టివే కాని నేఁడు ప్రతివిషయమునందును సర్వసమత్వ భావములు ప్రబలుచున్నవి. తండ్రీ పుత్రుఁడు, అన్న తమ్ముఁడు, గురువు శిష్యుఁడు, భార్య భర్త మొదలగువారు సమానులని, వారియందు మైత్రియే యుచితవర్తనమని, యదియే యుత్తమసంస్కారమని భావించుచున్నారు. కాని భారతీయసంస్కృతి కిది విపరీతము. మిత్రులయెడనే మైత్రి యుచితము కాని, పెద్దలయెడఁ దగదు. గురువులయెడ గౌరవమే తగును కాని, సమానభావము సమంజసము కాదు. తండ్రీ, తల్లి, అన్న, ఆచార్యుఁడు మొదలగువారు గురువులు. వీరియెడ విధేయతయే గాని సమత్వ మూచితము కాదు. సమత్వమునందు స్వాతంత్ర్యము కలదు; అభిప్రాయభేదమును బురస్కరించుకొని విడిపోవుట కవకాశము కలదు. కాని పైకుటుంబధర్మములందు స్వాతంత్ర్యము సముచితము కాదు. పెద్దలయాదేశ మెట్టిదైనను విధేయతతో నాచరించుటే గాని, తిరస్కరింపఁ దగదు. పెద్దలను పిన్నలు ధిక్కరించుట కవకాశ మేర్పడినచో వ్యవస్థయే నిరవకాశ మగును. ఒకరిమాట నొకరు విధేయతతోఁ బాటించుట సంభవింపకపోయినచో కుటుంబమునఁ గాని, సమాజమునఁ గాని యెట్టిమభ్యుదయమును

సాధ్యము కాదు. నేఁ డిది రాజకీయములలో మాత్రము క్రమశిక్షణము పేరిట నసిధారావ్రతముగఁ బాటింపఁబడు చునే యున్నది. నాయకు లొకవిధముగ నిర్ణయించిన పిదప కొందఱ కెవరి కైనను, అది నచ్చినను నచ్చకున్నను దానికి కట్టుపడియే వర్తింపవలసియున్నది. ఇట్టి క్రమశిక్షణమే కుటుంబసంబంధములందును, ఆవశ్యక మని గుర్తింప వలసియున్నది. పుత్రుఁడు తండ్రికి విధేయుఁ డైనచో వానికి వానితమ్ములు, పుత్రులు మొదలగువా రందఱును విధేయు లగుదురు. అతఁడు తండ్రిని ధిక్కరించినచో వానిపద్ధతియే తరువాతితరమువారి కాదర్శ మగును. మొగలాయిరాజవంశచరిత్ర యిందులకుఁ బ్రబలనిదర్శనము. అట్లే భార్యయును భర్తకు విధేయురా లైనచో బిడ్డ లందఱు నామెకు విధేయు లగుదురు. ఆమె భర్తను ధిక్కరించినచో నామెకు లోఁబడవలసినయక్కఱ బిడ్డలకును దోఁపక పోవచ్చును. కావున విధేయత యనునది కుటుంబమునకును, సమాజమునకును పునాది. ఈభావమే పాశ్చాత్యసంస్కృతియందును ప్రబలముగ కన్పించు చున్నది. విధేయతను గూర్చి 'శామ్యూల్ స్మైల్స్' (Samuel Smiles) ఇట్లు చెప్పెను "సద్వర్తన మవలంబింపవలసినప్రతివ్యక్తికిని తల్లిదండ్రులయెడ, యజమానియెడ, అధికారియెడలను విధేయతను కలిగియుండుట బోధింపవలయును. శైశవము విధేయతతోనే ప్రారంభము కావలయును. కాని వయస్సు వచ్చినను మనకది తప్పదు. మనము తుదివఱకును విధేయులముగనే యుండవలయును".

["Obedience, to the parent, to the master, to the officer, is what everyone who would do right should be taught to learn. Childhood should begin with obedience. Yet age does not absolve us; We must be obedient even to the end."]

## ధర్మనిర్ణయమున శాస్త్రప్రామాణ్యము

(85) విధేయత యస్వాతంత్ర్యలక్షణ మని, శాస్త్ర వాక్యములను గాని గురువాక్యములను గాని ప్రమాణముగఁ బాటింప నక్కఱ లే దనియు, ప్రతివిషయమును స్వతంత్రముగ నాలోచించి నిశ్చయించుకొనవచ్చు ననియు కొందఱు తలంతురు. కాని భారతీయదృక్పథమున ధర్మనిర్ణయమందుఁ గాని, వర్తనమునందుఁ గాని యెవఁడును స్వతంత్రుఁడు కాఁడు; ప్రతివ్యక్తియును ధర్మాధీనుఁడు. ధర్మము శాస్త్రాధీనము. ధర్మమునఁ గేవలపురుషబుద్ధి నిర్ణాయకము కానేరదు. ఎవనిపాటికి వాఁడు స్వతంత్రముగఁ దనబుద్ధివిశేషమునుబట్టి ధర్మమును నిశ్చయింపఁ బూనినచో నవ్యవస్థ యేర్పడును. ఒకకాలమునం దొక మేధావి యొకవిధముగ ధర్మమును నిర్ణయించినచో, మఱియొక కాలమున మఱియొక మేధావి తర్కబలముచేత పూర్వవిధానమును బూర్వపక్ష మొనర్చి తన కిష్టమైన దానిని సిద్ధాంత మొనరింపవచ్చును. దీనివలన నెప్పటికిని ధర్మమునకు వ్యవస్థ యేర్పడదు. మానవునిబుద్ధి యెంతకుశాగ్ర మైనను పూర్తిగా దోషరహితము కాఁజాలదు.

కానఁ బౌరుషేయములు కాని శాస్త్రములనే ధర్మము నందుఁ బ్రమాణముగ గ్రహింపవలసియున్నది. తపోబల ముచే స్వార్థలోభాదిదోషరహిత మైనసమాధిస్థితి నంది, యందు మహర్షులు దర్శించి ప్రకటించినసత్యములు వేదాది శాస్త్రములు. సమాధిస్థితియందు వ్యక్తిత్వము నకుఁ దావు లేదు. అందువలన నది యపౌరుషేయము. అందు దృష్టము లైనవిషయములును నపౌరుషేయములే యగును. వాని యందు వ్యక్తిత్వసహజము లగునపోహలకు, భ్రమలకుఁ దావు లేదు. కావున ధర్మమునం దిట్టియపౌరుషేయము లైనశాస్త్రములు ప్రమాణ మగుట శ్రేయస్కరము గాని, యెంతమహిమాన్విత మైనను, ఒకానొకవ్యక్తి యొక్క యంతఃకరణము ప్రమాణ మగుట శ్రేయస్కరము కాదు. భారతీయుల కిది సుప్రసిద్ధ మగుసనాతనసంప్రదాయము ఎంతమహాపురుషుఁ డైన నిది నాబుద్ధికి తోఁచినది కావున నిదియే ధర్మ మని చెప్పఁడు. ధర్మశాస్త్రకర్త లగుమ హర్షు లందఱును వేదములను స్మరించి వానియర్థమునే మరల బోధించిరి; తమబుద్ధికి తోఁచినట్లుగ చెప్పఁబూన లేదు. వేదార్థము బోధించుచుండుటవలననే మనుధర్మ శాస్త్రాదులు ప్రమాణము లగుచున్నవి. రామాయణ భారతభాగవతములు, పురాణములును వేదార్థమునే యవ లంబించి ధర్మమును బోధించుచున్నవి. భీష్ముఁడు ధర్మజు నకు ధర్మములను బోధించునప్పుఁడు, నాబుద్ధినిబట్టి యను భవమునుబట్టి నాయంతరాత్మ కిట్లు స్ఫురించుచున్న దని చెప్పక, "వేదము చెప్పిన నేను చెప్పితిన్", అనియే

చెప్పెను. శ్రీకృష్ణుడును సనాతన మై సంప్రదాయసిద్ధ మైన వేదార్థమునే గీతారూపమున నర్జునున కుపదేశించెను. భీష్ముఁడుగాని శ్రీకృష్ణుఁడు గాని వేదశాస్త్రములను వీడి స్వతంత్రు లై మాయంతరాత్మ కిట్లు తోఁచుచున్న దని చెప్పియున్నచో వెంటనే ధర్మజభీమార్జునులును, తమకుఁ దోఁచినట్లుగ ధర్మనిర్ణయముఁ జేయవచ్చును. అట్లే యెల్లరును తల కొక్క తీరుగ ధర్మమును నిర్ణయించుట సంభవించును. అట్లగుటవలన నవ్యవస్థయే ఫలించును గాని ధర్మనిర్ణయము కాదు. కావున శాస్త్రప్రోక్త మైనదే ధర్మము. శాస్త్రములు బోధించు వాఁడే యాచార్యుఁడు. ఆచార్యునిచే బోధింపఁబడినశాస్త్రమే సఫలము. శాస్త్రాచార్యోపదేశముల నవలంబించి ధర్మమున వర్తించువాఁడే సత్పురుషుఁడు. ఏదే నొక కారణముచేత ప్రఖ్యాతుఁ డైనవాఁ డొకఁడు చెప్పినమాత్రమున నది ధర్మము కాఁజాలదు. సక్రమముగ ధర్మమును గ్రహించి యాచరించి ధర్మాత్ముఁ డైనవాఁడే శాస్త్రోక్త మగుధర్మము నుపదేశించుట కర్హుఁ డగును. నేఁడును ప్రజాస్వామ్యపరిపాలన విధానమునందు నిట్టివ్యవస్థనే రాజ్యాంగశాసనము (Constitution) పేరిట నేర్పరచుకొనుచున్నారు. రాజ్యాంగశాసన మించుమించుగ నపౌరుషేయ మని చెప్ప నగును. ఒక్క వ్యక్తియొక్క బుద్ధి యెంతకుశల మైనను భ్రమప్రమాదములకు లోను గావచ్చు ననుతలంపుతోడనే మేధావు లనేకు లొకచోఁ జేరి శాసనములను చేయుచున్నారు. ఏయొకవ్యక్తికిఁ గాని, ప్రధానమంత్రికిఁ గాని,

తాత్కాలిక మైనయొక ప్రభుత్వమునకుఁ గాని, రాజ్యాంగ శాసనమునకు భిన్నముగ వర్తించుటకుఁ గాని, దానిని మార్చుటకుఁ గాని యధికారము లేదు. రాజకీయపక్షములు సైత మిట్టివ్యవస్థతోనే వర్తించుచున్నవి. ఆంగ్ల దేశమున సంప్రదాయసిద్ధ మైనరాజ్యాంగశాసననియమావళి నాధారముగఁ జేసికొనియే చిరకాలముగఁ బ్రజాస్వామ్యప్రభుత్వము జరుగుచున్నది. అట్టియెడల నపౌరుషేయము లగువేదశాస్త్రములను బ్రమాణముగ భావించి భారతీయులు తమధర్మజీవనవిధానమును జక్కదిద్దుకొనుట యావశ్యక మని వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు.

## బ్రహ్మచర్యాదివ్రతములు

(36) ఈధర్మజీవనవిశేషము లనేకములు కలవు. వీనియం దాచారములు, వ్రతనిష్ఠలు భారతీయసంస్కృతియందుఁ బ్రముఖస్థానము నాక్రమించుచున్నవి. ఇవి యన్నియును విశృంఖలజీవనమును వారించి నియతజీవనమును కలిగించుటకే యేర్పడినవి. నియతజీవనమువలన నింద్రియశక్తులు సంగృహీతము లై తేజోమహితత్వము కలుగును. తేజోమహితు లగువారే సకలపురుషార్థములను సాధింపఁ గల్గియుందురు. ఇట్టితేజోమహితత్వమును సంపాదించుటకే పురుషులకు గురుశుశ్రూష, బ్రహ్మచర్యము, స్త్రీలకుఁ బాతివ్రత్యమును విహితము లై యున్నవి. అట్లే పరమపురుషార్థ మగుపరమాత్మసాక్షాత్కారమున కనుకూలించునుత్తమజీవనవిధానమే సన్న్యాసము. బ్రహ్మ

చర్య పాతివ్రత్యసత్యాన్యాసములు భారతీయసంస్కృతికిఁ బ్రధానసూత్రములు. ఈమూఁడింటియందు నేఁడు కలుగుచున్న దౌర్బల్యముకలననే భారతదేశము దుర్బల మగుచున్నది. సకలాభ్యుదయములకు నివియే ప్రథమసాధనము లని గుర్తించుటయే నేఁ డావశ్యక మై యున్నది.

## శ్రీమద్రామాయణ మహాభారత భాగవతములు

(37) ఇట్టిధర్మవ్రతాదివిశేషములను నిస్కృష్టముగఁ దెలిసికొనుటకు మహర్షిప్రోక్తము లైనశాస్త్రేతిహాసపురాణములను పఠించుట యావశ్యకము. విశాల మగునీవాఙ్మయమును బరిశీలించుటకుఁ దగినయవకాశము లేనప్పుడు, ఈధర్మసంస్కృతిని సారరూపముగ బోధించు శ్రీమద్రామాయణ మహాభారతభాగవతము లనుగ్రంథత్రయము నైనను దప్పక పఠింపవలసియున్నది. వీనిని పఠింపనిభారతీయుఁ డెవఁడును యథార్థముగ విద్యావంతుఁ డనుపదమునకు యోగ్యుఁడు కాఁజాలఁడు. కావున యథార్థముగ విద్యావంతులు కాఁగోరుభారతీయు లెల్లరు నీమూఁడుగ్రంథముల నైనఁ దప్పక పఠింపవలయును.

## భారతీయశాస్త్రవిజ్ఞానము

(38) సమగ్రసంస్కృతికి ధర్మశాస్త్రవిజ్ఞానముతోఁబాటు ప్రకృతిశాస్త్రపరిజ్ఞానము నైత మావశ్యకము. భారతదేశమున ధర్మన్యాయమీమాంసాదిశాస్త్రములే గాక ప్రకృతిశాస్త్రములు నైతము ప్రాచీనకాలమునుం

డియు వర్ధిల్లుచునే యున్నవి. ఆయుర్వేదము, జ్యోతిశ్శాస్త్రము, శిల్పము, వాస్తు మొదలగునవి మిక్కిలి పెంపుఁ గాంచెను. వృక్షశాస్త్రము, జంతుశాస్త్రము, రసాయనశాస్త్రము, శరీరనిర్మాణశాస్త్రము మొదలగునవి యభివృద్ధి నొందక యుండినచో నాయుర్వేద మిప్పటి స్థితియం దుండుట యసంభావ్య మై యుండెడిది. ఇట్లే గణితశాస్త్రాభివృద్ధి లేనిచో జ్యోతిశ్శాస్త్రము పెంపొంది యుండదు. వాస్తుశిల్పశాస్త్రములు మిక్కిలి యౌన్నత్యము నొందియుండిననే తప్ప నేఁటికి నద్భుతావహము అగుచున్న ప్రాచీనప్రాసాదములు, విహారములు, దేవాలయములు సాధ్య మై యుండెడివి కావు. కావున నిట్టి ప్రాచీనభారతీయశాస్త్రవిజ్ఞానమును త్రోసిరాజనుట యక్రమము. స్వతంత్ర మై పటిష్ఠ మైనయేజాతియును దన ప్రాచీనశాస్త్రవిజ్ఞానమును ద్రోసివేయదు. ప్రాచీన మైన దంతయు పరమప్రమాణము కానక్కఱ లేదు. కాని దానిని విచారింపకయే నిరర్థక మని నిరసించుట మాత్ర మశాస్త్రీయము. నిజముగ శాస్త్రపరిశోధనమం దభిమానము కలవాఁ డెవ్వఁ డైనను చేతి కందినశాస్త్రవిషయమును పరిశీలింపకయే నిర్హేతుకముగ నిది వ్యర్థ మని నిరాకరింపఁడు. కావున ప్రాచీనభారతీయశాస్త్రవిజ్ఞానమును బరిశీలించి విలువగలయంశముల గ్రహించి తక్కిన వానిని సహేతుకముగ నిరాకరించుటయు మేలే యగును. మనశాస్త్రములు పటిష్ఠము లై యున్నచో పరదేశీయశాస్త్రపరిశోధనములవలన గ్రహింపఁదగినయంశములను

స్వీకరించి మనశాస్త్రములనే పెంపొందించుకొనవచ్చును. ఎట్లైనను నేఁడు భారతదేశమున విద్యాభ్యాసముఁ గావించుచున్న విద్యార్థులు పాశ్చాత్యశాస్త్రములందుఁ బారీణులగుచుండియును భారతీయగణితతర్కతత్త్వశాస్త్రాదుల నెఱుంగఁజాలకుండుట మిక్కిలి శోచనీయము. ఆచార్య, ప్రఫుల్లచంద్రరే భారతీయరసాయనశాస్త్రమును(History of Hindu Chemistry) పరిశీలించి దాని చరిత్రను రచించినట్లే తక్కినశాస్త్రములనుగూర్చియు నెంతయేని కృషి జరుగవలసియున్నది. ప్రాచీనభారతీయశాస్త్రవిజ్ఞానము నాధునికశాస్త్రపరిశోధనదృష్టితో సమన్వయించుకొనుట యావశ్యకము.

## సంస్కృతభాష, విజ్ఞానసాధనము

(39) ఈ భారతీయవిజ్ఞానమును చక్కఁగా గ్రహించుటకు సంస్కృతభాష యావశ్యక మగుసాధనము. సంస్కృత మభ్యసింపనిదే యీవిజ్ఞానమును నిష్కృష్టముగ గ్రహించుటకు నవకాశ ముండదు. ఆధునిక ప్రకృతిశాస్త్రములయందుఁ బ్రవీణు లగుచున్నవిద్యావంతులు ప్రాచీనభారతీయశాస్త్రములను పరిశీలింపవలెనన్నచో సంస్కృతము నభ్యసించుట తప్పదు. కేవల సంస్కృతపండితులు వైద్యగణితాదిశాస్త్రములందు ప్రవేశమును పొందఁజాలరు. కావునఁ బాశ్చాత్యవైద్యగణితాదిశాస్త్రములందుఁ బ్రవీణు లగుచున్నవారు సంస్కృతము నభ్యసించి యాయుర్వేదజ్యోతిశ్శాస్త్రాదిగ్రంథములను పరిశోధించిననే తప్ప విజ్ఞానసమన్వయ మేర్పడదు.

ఇట్టి ప్రాచ్యపాశ్చాత్యవిజ్ఞానసమన్వయమువలన నెంతేని మేలు కలుగఁ గలదు. ఈవిజ్ఞానసమన్వయమునకై భారతీయవిద్యావంతుల కెల్లరకును సంస్కృతభాషాపరిజ్ఞాన మావశ్యకము.

## అనువాదములు చాలవు

(40) ఇది యనువాదములచే సాధ్య మగును. కాఁబట్టి విద్యావంతు లెల్లరును సంస్కృతము నభ్యసింప నక్కఱ లేదని కొందఱు తలంతురు. కాని యనువాదము లెంతజాగరూకతతోఁ గావించినను శాస్త్రవిషయము లందు నిష్కృష్టత చాలదు. అనువాదములఁ గావించుట కైనను సంస్కృతము నభ్యసించుట తప్పదు. మఱియు ననువాదములపై నాధారపడినచో నేయొకశాస్త్రమునందైనను కొన్నిగ్రంథములను పరిశీలించుటకే యవకాశ ముండును గావి దానియందు, నితరశాస్త్రములందును గల తక్కినసంస్కృతగ్రంథములను పరిశీలించుట కవకాశ ముండదు. కావున భారతీయవిద్యావంతు లెల్లరును సంస్కృతము నభ్యసించుట యావశ్యకము.

## సంస్కృతము, జాతీయభాష

(41) సంస్కృతము విజ్ఞానసాధన మగుటయే గాక భారతీయులకు జాతీయభాషయై యున్నది. భారతదేశమున నఖండజాతీయభావము నత్యంతప్రాచీనకాలము నుండి నేఁటివఱకు నేవిజ్ఞానము పెంపొందించుచు వచ్చినదో, యట్టి శాస్త్రేతిహాసపురాణాదివిజ్ఞాన మంతయు

సంస్కృతవాఙ్మయమై యున్నది. అట్టివిజ్ఞానమునకు సాధనమై యఖండజాతీయతాపోషకమైన సంస్కృతమే భారతీయులకు జాతీయభాష. ఏది యఖండజాతీయభావమునకు నాధారమై తత్పరిపోషమునకు సాధనమగుచున్నదో యదియే జాతీయభాష. చాలమంది ప్రజలచే నరముచేసికొనఁబడినంతమాత్రమున నాకస్మికముగ నే భాషయును జాతీయభాష కాఁజాలదు. ఇట్టిజాతీయతను నిలుపఁగలసామర్థ్యము సకలప్రాంతములకు సమ్మాన్యమైనసంస్కృతమునకే కలదు. కావున నదియే జాతీయ భాష.

## ప్రాంతీయతలు జాతీయతలు కావు

(42) కాని నేఁడు మనజాతీయతనుగూర్చియుఁ గొన్నియపోహలు కలవు. భారతదేశమునఁ బ్రాచీనకాలమునుండియు నేకజాతీయతయే కలదు. ఏప్రాంతమందు జన్మించినను ప్రతివ్యక్తియు నాసేతుహిమాచలమైనభారతభూమిని, దానిచరిత్రను స్వీయమని యభిమానించుచున్నాఁడు. ఆంధ్రజాతి, మహారాష్ట్రజాతి, కాశ్మీరజాతి మొదలగునవి ప్రాంతీయతలనే వ్యక్తీకరించును. ఇవి భాషామాత్రభేదముచే నేర్పడుచున్నవే గాని జాతీయతయందలి భేదములచే గాదు. కావున ప్రాంతీయతలు జాతీయతలు కానేరవు. ఆంధ్రులు మహారాష్ట్రులకు జాతిచేత భిన్నులు గారు; వంగీయులును కాశ్మీరవాసులకంటె భిన్నజాతీయులు కారు. కావున నీప్రాంతీయతలను జాతీయతలనుగా భ్రమించుట యనర్థకము. ఇప్పటిప్రాంతీయ

ప్రభుత్వవ్యవస్థలో, ప్రాంతీయస్వార్థములు ప్రబలుచున్న సమయమున, నీయఖండజాతీయతను దేశక్షేమశాంతిభద్రతలదృష్టితోఁ గాపాడుకొనుట యావశ్యకము. ఇందులకు సంస్కృతమే యుత్తమసాధనము. హిందీని ప్రభుత్వ వ్యవహారభాషగ నుపయోగించుకొనినను సంస్కృతమును జాతీయభాషనుగ గుర్తించి సకలప్రాంతములందును పెంపొందించుకొనుట యావశ్యకము.

## సంస్కృతము, సకలదేశసమ్మాన్యము

(43) ప్రపంచవిజ్ఞానదృక్పథమున సహితము ప్రాచీనవేదశాస్త్రపురాణాదిసంస్కృతవాఙ్మయమువలననే యితరదేశీయులు భారతదేశముపెడ శ్రద్ధను జూపుచున్నారు. అది ప్రాచీనవిజ్ఞానపరిశోధనమునకు మిక్కిలి యావశ్యకమై యున్నది. విదేశీయులచే సైతము ప్రముఖవిజ్ఞానసాధనముగ నారాధింపఁబడుచుండిన సంస్కృతమును భారతీయులు పైకిఁ దెచ్చుకొనకుండుట సమంజసము కాదు.

## మతాంతరులు, సంస్కృతము

(44) సంస్కృతము వేదశాస్త్రములకు సంబంధించినభాష యగుటచే హిందువులకు పవిత్రము కావచ్చును గాని మహమ్మదీయులు, క్రైస్తవులు మొదలగు మతాంతరుల కది జాతీయభాష యగుట తగ దని కొందఱందురు. కాని మతవిశ్వాసములచే వారు మహమ్మదీయ

క్రైస్తవాదిధర్మముల నవలంబించుచున్నను భారతదేశమును మాతృదేశముగ నభిమానించుచుండుటచే భారతీయులే యగుచున్నారు. ఆసేతుహిమాచల మైనభారతభూమిని త్రికరణశుద్ధిగ నెవఁడు మాతృభూమిగ భావించునో, వాఁడు భారతీయుఁ డగును. భారతీయునకు ప్రతివానికిని ప్రాచీనభారతీయచరిత్ర, సంస్కృతిపరిజ్ఞాన మత్యంత మావశ్యకము. ఇట్టిపరిజ్ఞానము లేకుండ నెవఁడును యథార్థముగ భారతీయుఁడు కాఁజాలడు. ఇందులకు సంస్కృతభాషాభ్యసనమే ప్రముఖసాధనము. కావున మతాంతరులకు సైతము సంస్కృతమే జాతీయభాష యనుట స్పష్టము. వారికి సంస్కృతభాషాభ్యాసము దుర్ఘట మనుమాట యుక్తిహీనము. నేఁ డన్నిమతములవా రాంగ్లభాష నత్యుత్సాహముతో నభ్యసించి, యందు పాండిత్యమును సైతము సంపాదించుచున్నారు. కేవలము విదేశీయ మగునాంగ్లభాషను పరమోత్సాహముతో నభ్యసింపఁగలినప్పుడు మనదేశమునకు సహజ మైనసంస్కృతము నభ్యసింపఁజాలరనుట యుక్తము కాదు. శ్రద్ధ యున్నచో నభ్యసింపసాధ్యము కానిభాష యుండదు. జర్మనీ, ఫ్రాన్సు మొదలగుదేశములం దనేకులు సంస్కృతము నభ్యసించి పండితులగుచుండఁగా, భారతదేశముననే పుట్టి పెరుగుచున్నవారు సంస్కృతభాషాపరిజ్ఞానమును సంపాదింపలే రనుట హాస్యాస్పదము. కావున భారతీయు లెల్లరును సంస్కృతమును జాతీయభాషగా నభ్యసించుట యావశ్యకము.

## జాతీయత, మతసామరస్యము

(45) సంస్కృతము సాధనముగ జాతీయభావమును పెంపొందించినచో నది కేవలము హిందూసంస్కృతిని బలపఱచి యన్యమతములకు నపకారక మగు నేమో యని కొందఱు సంశయింతురు. భారతీయసంస్కృతిధర్మాన భిజ్ఞతయే యిందులకు మూలము. భారతీయులకు స్వధర్మానుష్ఠానమే కాని పరధర్మభంజనము, అసహనమును లేవు. "స్వధర్మాచరణమున మరణ మైనను శ్రేయస్కరమే, పరధర్మము మాత్రము భయంకరము."

[श्लो· स्वधर्मे निधनं श्रेयः, परधर्मो भयावहः ।
– गीता. अध्या. 3, श्लोक: 35]

అనుగీతాప్రవచనమును హిందువులు పరమసిద్ధాంతముగ భావింతురు. దీనినే తక్కినధర్మము లవలంబించువారివిషయమునను ననువర్తింపఁ జేయుదురు. కావుననే హిందువులు పరులధర్మమును మార్చుటకుఁ గాని, భంగపఱచుటకుఁ గాని యత్నింపరు. ఏది యెవనికి సహజధర్మ మగునో యదియే వానికి శ్రేయస్కరము. ప్రతివ్యక్తికిని వానిధర్మమునందే సకలశ్రేయస్సులు లభింపవచ్చును. కావున నెవనిసహజధర్మము నైనను మార్ప యత్నించుట యసంగతము. మఱియును హిందూధర్మము జన్మసిద్ధమే కాని, యొకరిచ్చిన వచ్చునది కాదు. కావున హిందువు లేనాఁడు నెవరిమతవిశ్వాసములను భంగపఱచుటకు

ప్రయత్నించినట్లు నిదర్శనములు లేవు. ఇఁకముం దట్లు చేయవచ్చు ననుటకు నాధారములును లేవు. హిందువులకు పరమతసహనము, సర్వమతసమన్వయభావము సహజము. పరమేశ్వరుని తా మర్చించువిధానముననే యితరులు నర్చింపవలయు ననుపట్టుదల వారికి లేదు. ఏయే నామరూపములతోఁ నెవ్వఁ డెప్పు డెట్టివిధమున భక్తిపూర్వకముగ భగవంతు నర్చించినను తదనుగ్రహమునకు పాత్రుఁడు కాఁ గలఁ డనియే వారు విశ్వసింతురు. నామరూప రహితుఁ డగుపరమేశ్వరునకు భక్తిశ్రద్ధాపూర్వకముగ నెవ రెన్ని విధముల నామరూపములను భావించి యారాధించి నను సమంజసమే యగును; లేదా నిరాకారునిగ భావించి యైనను ప్రార్థింపవచ్చును. కాని సకలప్రార్థనములను సర్వలోకపాలకుఁ డగుపరమేశ్వరునకే చెందును. "ఆకాశమునుండి పడినజల మంతయు నెట్లు సముద్రమునకే చేరుచున్నదో, యట్లే సర్వదేవతలకుఁ గావింపఁబడుచున్న నమస్కారములును పరమేశ్వరునే జేరుచున్నవి."

[శ్లో॰ आकाशात् पतितं तोयं, यथा गच्छति सागरं।
सर्वदेवनमस्कारः, केशवं प्रतिगच्छति ॥]

కావున సంస్కృతభాషామూలమున హైందవ సంస్కృతియే పైకివచ్చు ననుకొన్నను సర్వమతసామరస్యమే బలపడును గాని యన్యమతములకు నెట్టియపకారము సంభవింపదు.

## జాతీయత, అంతర్జాతీయత

(46) ఇట్టి భారతజాతీయతను బలపఱచుకొనుటకై ప్రయత్నించుట సంకుచితజాతీయస్వార్థములను పెంపొందించు నని కొందఱు భావింతురు. ఆధునిక నాగరక ప్రపంచమున మానవజాతీయతను మాత్రమే యారాధింపవలయును గాని, సంకుచితము లగుభిన్నదేశజాతీయతలను పైకిఁదెచ్చుట ప్రపంచశాంతికి భంగకర మని చెప్పుదురు. అఖండ మగుభారతజాతీయతకొఱకై ప్రాంతీయతల నెట్లు త్రోసివేయవలసియున్నదో యట్లే సకలమానవజాతియొక్క శాంతిభద్రతలదృష్టితో భిన్నజాతీయతాభావములను త్రోసివేయుటయే శ్రేయస్కర మని భావించుచున్నారు. "నేను ప్రపంచపౌరుఁడ" నని చెప్పుకొనుటయే యుత్తమసంస్కృతి యనియుఁ దలంచుచున్నారు. కావున జాతీయభావ మొకసంకుచితస్వార్థ మనియే చెప్పవలసియున్నది. కాని ప్రాంతీయతలు, జాతిమతభేదములు తమంతతా మేనాఁడును సంకుచితస్వార్థములుఁ గావు; వినాశకరములును గావు. ఇట్టిభేదములు లేకుండ మానవులేనాఁడు నుండలేదు; ఇఁక ముందు పూర్తిగ పోవు ననుటకును నాధారములులేవు. ఇవి యెప్పుడును దేశకాలములచే సహజముగ నేర్పడుచుండును. వీనిమూలమున తాత్కాలికము లైనకొన్నిజీవనసౌకర్యములు నిర్వహింపఁబడుచుండును. వీనిని పూర్తిగ నిర్మూలించుట యసంభవము. ఉన్నభేదములను గుర్తించి వానివలన సంఘర్షణము

సంభవింపకుండునట్లు సామరస్యమును పెంపొందించుకొను చుండుటయే సమంజసము.

## స్వార్థము సకలకలహములకు మూలము

(47) ప్రపంచచరిత్రలో జాతిమతవిద్వేషముల వలనఁ గలిగిన యుద్ధములు, పరదేశాక్రమణములు, తత్ఫలముగ సంభవించిన రక్తపాతము, వినాశము నమితముగా నున్న దనుట యథార్థము. కాని వాని కంతకును జాతి మతభేదములే మూలమనుట భ్రాంతి. స్వజాతిమతధర్మానుష్ఠాన మేనాఁడు నెవనికిని వినాశకము కాఁజాలదు. పరజాతిమతధర్మాసహనము, విద్వేషము, స్వార్థము, దురహంకారము మొదలగునవియే సకలకలహములకు, యుద్ధములకు, వినాశములకు మూలము లైనవి. కావున స్వార్థవిద్వేషముల నిర్మూలింపవలయునే కాని జాతిమత ధర్మములను కాదు. ప్రకృతిసిద్ధము లై దేశకాలాధీనము లైనయీజాతిమతధర్మభేదములను నిర్మూలించుట యసాధ్యము. కావున స్వార్థద్వేషరహిత మైనస్వజాతిమత ధర్మాచరణమును, పరస్పరసహకారపరోపకారభావములను, మానవసేవాభావమును పెంపొందింపవలయునే గాని స్వజాతిమతధర్మనిర్మూలనమునకుఁ బూనుకొనరాదు. జాతిమతధర్మభ్రష్టత యుత్తమసంస్కారము కానేరదు. భిన్నధర్మపరాయణులకే సామరస్యము కాని ధర్మహీనులకుఁ గాదు. హిందువులు హిందువులు గానుండి, క్రైస్తవులు క్రైస్తవులుగ నున్నచో వారికి మైత్రి సంభవించు

నపుడది సామరస్య మగును. అట్లు గాక హిందువుల యందు హైందవధర్మము లేక క్రైస్తవులయందు క్రైస్తవధర్మమును లేకున్నచో నట్టిధర్మభ్రష్టులకు నేసామరస్యము నక్కఱయే లేదు. ధర్మభ్రంశ మనర్థక మనియు ధర్మనిష్ఠుఁడే తేజస్వియై యాత్మోపకారము, పరోపకారమును సాధింపఁగలఁ డనియు గమనించి యుంటిమి. కావున భిన్నజాతిమతధర్మములకు సామరస్యమే కర్తవ్యము గాని, ధర్మభ్రంశము గాదు. ఏజాతిమతధర్మము లందున్నను సకలమానవుల శ్రేయస్సును కోరుచుండవల యును; దానికై యత్నించుచుండవలయును. 'సర్వమానవులు సుఖింతురు గాక. సర్వలోకములు సుఖించును గాక',

[सर्वे जनास्सुखिनो भवंतु -
लोका स्समस्तास्सुखिनो भवंतु.]

అనునదియే భారతీయులకు నిత్యధ్యేయము. ఇట్టి భారతజాతీయత బలపడినచో సర్వమానవులకు సామరస్యమును, శాంతిభద్రతలనే ప్రసాదించును. కావున భారతజాతీయత యంతర్జాతీయతకు విరోధి కానేరదు.

## ఆధునికనాగరకత, ఆచారపరత్వము

(48) నేఁటినాగరకజీవనమున భారతీయధర్మాచారపరత్వము దుర్ఘటము, కావున పరిత్యాజ్య మని కొందఱు తలంతురు. ఇట్లనుట సమంజసము కాదు. వేదశాస్త్రప్రామాణ్యము, జన్మాంతరలోకాంతరవిశ్వాసము,

వర్ణాశ్రమాచారధర్మములు, పాతివ్రత్యసన్యాసాదివ్రతములు, విశ్వకల్యాణభావము భారతీయసంస్కృతియందు ప్రధానాంశములు. వీని నెట్టినాగరకతాభ్యుదయమునందైనను, శ్రద్ధయున్నచో, చక్కఁగాఁ బాటింపవచ్చును. ఏవేని కొన్నియాచారముల ననుష్ఠించుటకు వీలుకాకుండ విమానయానాదులు సంభవించినచో వానిని పూర్తిగ పరిత్యజింప నక్కఱ లేదు. అట్టియెడల శాస్త్రానుగృహీతములైనయాపద్ధర్మములు, ప్రాయశ్చిత్తకల్పము లనేకములు గలవు. కావున నెట్టిస్థితియందైనను జన్మాంతరలోకాంతరవిశ్వాసము, శాస్త్రప్రామాణ్యబుద్ధియు నున్నచో ధర్మసంస్కృతిని కోల్పోవ నక్కఱ లేదు.

## ధర్మసంస్కృతి, సాహిత్యము

(49) ఈధర్మసంస్కృతియే యింతవఱకును భారతీయసాహిత్యమునకు సారముగ నున్నది. ఇఁక ముందును సాహిత్యము జాతీయవికాసాభ్యుదయములకు సాధనమై విశ్వహితప్రబోధకము కావలె నన్నచో మనమీ ధర్మసంస్కృతి నవలంబించియే సాహిత్యసృష్టికి పూనుకొనవలసియున్నది. ప్రాచీనకాలమునుండియు సాహిత్యమున నంతర్వ్యాహినిగఁ బ్రవహించుచున్న యీధర్మసంస్కృతిని, సంప్రదాయములను చక్కఁగా గ్రహించి నూతనభావములను, విదేశీయములైనను విజాతీయములైనను, వానితో సమన్వయించుకొనుటకుఁ బ్రయత్నింపవలయును.

## సాహిత్యము, విశాలదృష్టి

(50) నేంటిరచయితలు రామాయణభారతాది గ్రంథములను ప్రధానముగఁ బఠించుచుండుటయే గాక ప్రపంచసాహిత్యమును సైతము పరిశీలించి నూతనసాహిత్యవిధానములను గ్రహించి మనసాహిత్యమును శోభింపఁ జేయవలసియున్నది. వివిధసాహిత్యపరిశీలనమునకు నాంగ్ల భాష ముఖ్యసాధనము. యథావకాశముగ మనదేశములోని వివిధప్రాంతీయసాహిత్యములను, ఆంగ్లసాహిత్యము రష్యన్ సాహిత్యము మొదలగువానియందలి విశేషవిధానములను పరిశీలింపవలసియున్నది. రచయితలు విశాలదృష్టి కలిగి యుండి జాతిమతధర్మాదిభేదములయందు సామగస్యమును ప్రతిపాదించుటకు, సకలవిషయములందును సమానము, సహకారము, పరోపకారభావము, మానవసేవాభావమును ప్రబోధించుటకుఁ బ్రయత్నించుచుండవలయును.

## సాహిత్యము సత్యము, శివము, సుందరము

(51) సాహిత్యమును రచయితలు, సహృదయులును వినోదమాత్రముగఁ గాక మానవాభ్యుదయమునకు మహిత సాధనముగ భావింపవలసియున్నది. సకలకళలయందును సాహిత్యము విశిష్టమైనది. కళ యనఁగా నంశ మని యర్థము. ఇది దేనిలో నంశ మని ప్రశ్న వెంటనే యుదయించును. సృష్టియందే దేది విభూతిమహితమో, శ్రీమంతమో తత్సర్వము పరమేశ్వరాంశమే యగును.

[श्लो. यद्यद्विभूतिमत्सत्त्वं, श्रीमदूर्जित मेव वा ।
तत्तदेवावगच्छ त्वं, मम तेजोऽशसंभवं ॥
भ. गीता. अध्या. 10, श्लो. 41]

కావున సకలకళలును పరమేశ్వర తేజోంశములే యగును. అట్టియీకళలు మానవులకు నలౌకిక మగునానందము నొసంగుచు క్రమక్రమముగ పరమేశ్వరప్రాప్తికి సాధనము లగుచున్నవి. పరమేశ్వరుఁడు సత్యశివతాసౌందర్యాత్మకుఁడు. తదంశ మగుకళయును సత్యము, శివము, సుందరము నగుచున్నది.

## సాహిత్యగౌరవము

(52) సౌందర్యసృజనమే కళలకు ప్రాథమిక ధర్మము. సౌందర్యసృష్టియే కళ. సాధనభేదముచే కళలు భిన్నము లగుచున్నవి. నాదమున సౌందర్యసృష్టి సంగీతము. రేఖాసౌందర్యము చిత్రలేఖనము. శబ్దార్థరామణీయకము సాహిత్యము. ఇది రామణీయకప్రధాన మయ్యును విజ్ఞానప్రదము నగుటచే తక్కినకళలకన్న విశిష్ట మగుగౌరవము నొందుచున్నది. మఱియు తక్కినకళలకన్నఁ జిరతరానందమును కలిగించును. ఒకసారి సృష్టింపఁబడిన సాహిత్యము, ఎన్నిదేశములం దైనను, ఎన్నికాలములం

డైన నానందమును కలిగించుచునుండఁగలదు. కావున సాహిత్యము మానవునివినోదమునందే గాక విజ్ఞానము నందును గురుస్థానము నాక్రమించియున్నది. దీనిస్వరూప మును చక్కఁగా గ్రహించినచో సంకుచితభావములకు స్థాన ముండదు.

## సాహిత్యమున సత్యత్వము

(58) సాహిత్యమునకు సత్యత్వ మొకలక్షణము. భిన్నదేశకాలములందు చెడక నిలుచుట సత్యత్వము. సాహిత్యమునకు దేశకాలములయవధులు లేవు. ఏదేశ మునం దైనను, ఏకాలమునం దైనను, ఎవఁడు దేనిని రచించినను, నది రమణీయముగా నున్నచో, సకలదేశము లందును సహృదయు లందఱును దాని నభినందించి యానందింతురు. వాల్మీకివ్యాసులు, నన్నయతిక్కనలు, షేక్స్పియర్ మిల్టనులు మొదలగువారు భిన్నదేశకాలీను లైనను వారిరచనములయందలిరమణీయతను సకలదేశము లందును సహృదయులు గ్రహించి యానందించుచునే యున్నారు. కావున దేశకాలాతీత మైనసాహిత్యసౌంద ర్యరో సత్య మని చెప్పవలసియున్నది. మానవులకు సహ జము లైనసుఖదుఃఖములు సాధారణముగ నేదేశకాల ములం దైనను సమానముగనే యుండును, గావున నట్టి శాశ్వతము లైనభావములను ప్రతిపాదించుచుండుటవలన దీనికి దేశకాలాతీత మైనమహత్త్వము కలిగిన దనియు చెప్పవచ్చును.

## సాహిత్యము శివప్రదము

(54) సాహిత్యమునకు శివప్రదత్వము మఱియొక లక్షణము. శివ మనగా మంగళము. మానవులకు శ్రేయ మును కలిగించుచు దివ్యత్వము నందుకొనుట కుపకరించు సాధనము లన్నియు మంగళప్రదములే యగును. దీనినే లోకహిత మని, విశ్వశ్రేయ మనియు పేర్కొనుచుందురు. సాహిత్యమునకు లోకహితపరత్వ మత్యున్నత మైన లక్ష్యము. ఈలక్ష్యముతో రచింపఁబడినగ్రంథములే లోక మున నత్యున్నతస్థానము నందియున్నవి. "కృష్ణద్వైపా యనుఁ డర్థి లోకహితనిష్ఠం బూని గావించె ధర్మాద్వైత స్థితి భారతాఖ్య మగులేఖ్యం బైనయామ్నాయమున్ "అని తిక్కనార్యుఁడు చెప్పియుండెను. సాధారణముగ మహా కవు లందఱు నిట్టిలోకహితనిష్ఠనే కలిగియుందురు. నన్నయభట్టారకుఁడు కావ్యము విశ్వశ్రేయోరూప మని నిర్దేశించెను. కావ్య మెల్లరకు నెల్లశుభములను కలిగించు నట్టి దని నన్నపార్యునియభిప్రాయము. "కవులు లోక ముచే గుర్తింపఁబడని ప్రపంచశాసనకర్తలు." (Poets are unacknowledged legislators of the world• -"A defence of Poetry" - Shelley.) అని పలికిన షెల్లీ సైత మీలోకహితమునే భంగ్యంతరమున నుద్దేశిం చెను. ఈలక్ష్యమువలన సాహిత్యము శివప్రద మగు చున్నది.

## సాహిత్యమునకు సౌందర్య మాత్మ

(55) సాహిత్యమునకు సౌందర్య మాత్మ. సౌందర్య మనఁగా రమణీయత. ఏది ప్రతిక్షణము నూతనత్వము నొంది యాకర్షించుచుండునో యదిరమణీయ మగును. కావున సాహిత్యసౌందర్యమునకు ప్రాఁతఁదనము లేదు. నన్నపార్యునిభారతము గాని, షేక్స్పియర్ నాటకములు గాని యెన్నిశతాబ్దములు గడచినను ప్రాఁతఁదనమును పొందుట లేదు; ఆకర్షణమును కోల్పోవుట లేదు. క్రొత్తవైనంతమాత్రమున నేఁటిరచనలు అన్నియు నూతనత్వమున నాకర్షణీయములుగ నుండు నని చెప్పఁజాలము. ఈ సాహిత్యసౌందర్యము దేశకాలభేదాతీత మగుటయే గాక జాతిమతసిద్ధాంతములకు నతీతముగ నున్నది. రామాయణాదికావ్యములను పాశ్చాత్యులును, బైబిలుగ్రంథమును క్రైస్తవేతరులును సాహిత్యసౌందర్యమునకై సేవించుచునే యున్నారు.

## సాహిత్యసౌందర్యస్వరూపము

(56) ఈసౌందర్యస్వరూపమును నన్నయభట్టారకుఁడు చక్కఁగా నిర్దేశించెను. "కావ్యము విశ్వశ్రేయము. అది దోషరహితములు, నలంకృతములు నగుశబ్దార్థములు. ఏది రసవృత్తియో యది వాక్కు. కవులచే రసము యథాతథముగ సాధింపఁ దగినది కదా!"

[श्लो. विश्वश्रेयः काव्यम्, तददोषौ परिष्कृतौ
च वागर्थौ ।
सा वाग्या रसवृत्तिः, साध्यो हि रसो
यथातथं कविभिः ॥
– नन्नयभट्टारकस्य आन्ध्रशब्दचिन्तामण्याम्. 1.1]

సౌందర్యనమునకు దోషరహితత్వము, అలంకృతత్వము ముఖ్యలక్షణములు. ఇతరులదృష్టిలో పరిశుభ్రముగ నాకర్షణీయముగ నుండుటకు నెట్లు ప్రయత్నింతుమో యట్లే రచనము లందును నిర్దుష్టముగ సాలంకారముగ శబ్దార్థములను గూర్చుకొనుటకు యత్నింపవలయును. కావున భాషామర్యాదలను, భావసంప్రదాయములను చక్కఁగా గ్రహించి వాని కనుకూలముగనే రచింపఁదగును. కాని యిట్టి సాధారణనియమములను సైతము దేశభాషారచనములందు కొందఱు పాటించుట లేదు. ఆంగ్లభాషయం దతిజాగరూకతతో నిర్దుష్టముగ సాలంకారముగ రచించుటకుఁ బ్రయత్నించువారు సైతము మాతృభాషపై నట్టిశ్రద్ధను జూపకుండుట మిక్కిలి శోచనీయము. సమాజమున వ్యక్తివర్తనమునందు మర్యాదాభంగము కలిగినచో మనస్సునకు నొప్పి కలుగునట్లే, సాహిత్యమునందును శబ్దదోషము గాని, యనుచితభావము గాని సహృదయులకు నేవగింపును గలిగించును. అట్టిసంకోచము కలిగినతరువాత నారచనమునందలి సౌందర్యము నభి

నందించుట దుర్ఘట మగును. కాని సహృదయాభినంద నమే సాహిత్యసౌందర్యమునకు సద్యఃఫలము. సౌంద ర్యాస్వాదనమున సహృదయులందు కలుగుసంతోషపారా వశ్యమునే రస మందురు. కావున రసమునకు సౌందర్యము మూలము. రచయిత యెంతగా సౌందర్యమును పోషించునో సహృదయునియందు రస మంతగాఁ బుష్టినొందును; రచనము దోషయుత మైనచో రసము హీన మగును. కావుననే రసవృత్తి కలిగినదే కావ్యమున వాక్కగు నని నన్నయభట్టారకుఁడు నిర్దేశించెను. ఈరసపోషణసామర్థ్యమును బట్టియే రచనములందు, రచయితలందును, ఉత్తమమధ్యమాధమతారతమ్య మేర్పడుచున్నది.

## సాహిత్య మొకయారాధనవిశేషము

(57) ఇట్లు దేశకాలమతసిద్ధాంతాదుల కతీత మై లోకహితప్రద మైనసాహిత్యము సత్యము, శివము, సుందరము నగుచున్నది. కావున మహనీయ మైనయీకళాసేవనము పరమేశ్వరారాధనమే యని చెప్పవచ్చును. భారతగ్రంథమును హరిహరనాథాంకితముగఁ దెనుఁగున రచించుచుఁ దిక్కనార్యుఁడు 'ఇదియు నొకయారాధనవిశేషం' బని పేర్కొనియుండెను. (ఆంధ్రమహాభారతము. విరాటపర్వము.) కావున సాహిత్యమును పవిత్ర మగునారాధనవిశేషముగ భావించి యాత్మోపకారమును, పరోపకారమును సంపాదించుటయే రచయితలకు కర్తవ్యము.

## సాహిత్యసంప్రదాయములు

(58) జాతీయజీవితమునందువలెనే సాహిత్యమునందును సంప్రదాయములు పూర్వవిజ్ఞానపరంపరాఫలములుగ నేర్పడుచుండును. మహాకవు లట్టిసంప్రదాయముల నవలంబించుచునే తమప్రతిభాబలముచే రచనయందు వైచిత్ర్యమును, భావములయందు స్వాతంత్ర్యమును జూపుచుందురు. సంప్రదాయముల నవలంబించినంతమాత్రమున రచనమున ప్రాశస్త్యము గలుగు నని కొందఱు భ్రమింతురు. సంప్రదాయభంగ మొనరించి క్రొత్తవిధానముల నవలంబించినంతమాత్రమున నూతనత్వము, రమణీయత కలుగు ననియుఁ దలంతురు. కాని రచనయందలిరామణీయకము కవిప్రతిభాబలముమీఁదనే యాధారపడియుండును; సంప్రదాయావలంబనముపైఁ గాని, తద్భంగముపైఁ గాని యాధారపడియుండదు. కావున నూతనవిధానములను స్వీకరింపవలసివచ్చినచో పూర్వసంప్రదాయములతో సమన్వయించుకొనఁదగును. నేఁడు రాజకీయసాంఘిక జీవనమునందువలెనే సాహిత్యమునందు మార్పులు మిక్కిలి వేగముగ సంభవించుచున్నవి. మార్పులు సజీవసాహిత్యమునకు సహజము. కాని యట్టిమార్పు లెల్లప్పుడు నభ్యుదయమునే సూచించు నని చెప్పఁజాలము. కావున వీనిని చక్కఁగాఁ బరిశీలించి యభ్యుదయాత్మకము లగువానిని స్వీకరించుట శ్రేయస్కరము.

## ప్రాచీనులైన మహాకవులు ప్రజాకవులు

(59) పూర్వసాహిత్య మంతయు మహారాజుల యాశ్రయమున రచింపఁబడినది, కావున నది రాజులచరిత్రములను వర్ణించుచుఁ బాండిత్యప్రధానమై యారాజులకు, మంత్రులకు వారియాస్థానపండితులకు మాత్రమే యర్థమై యానందమును కలిగించునట్టిదిగ నేర్పడియుండె నని కొందఱు తలంతురు. ఈకారణముచేతనే ప్రాచీనసాహిత్యమున రాజులకష్టసుఖములే గాని సాధారణప్రజలసుఖదుఃఖములు చిత్రింపఁబడలే దని చెప్పుచుందురు. నేఁడు ప్రజాసామాన్యమున కంతకును చక్కఁగా బోధపడునట్లు వారిసుఖదుఃఖములను చిత్రించుచు, నభ్యుదయమార్గములను సూచించుచుఁ బ్రజాసాహిత్యమును సృష్టింపవలయు నని పలువురు తలంచుచున్నారు. ఈయుద్యమము మిక్కిలి ప్రశంసనీయము. కాని ప్రాచీనసాహిత్యమంతయుఁ బ్రజలకు దూరమై యుండె నని భావింపనక్కఱ లేదు. ప్రౌఢకావ్యములు కొన్ని పండితైకవేద్యములై ప్రజలకు దూరమైయున్నను, సాహిత్యమంతయు నట్లుండ లేదు. మనసాహిత్యమున మహాకవు లందఱును లోకహితనిష్ఠగలవా రనియే గమనించియుంటిమి. వారిని ప్రజాకవు లనియుఁ జెప్పవచ్చును. వారు ప్రజాహృదయమునఁ బ్రతిధ్వనించుచున్నయుదాత్తకథావస్తువులనే స్వీకరించి ప్రజాప్రబోధముకొఱకే మహాకావ్యములను రచించిరి. వాల్మీకి రామాయణమహాకావ్యమును ప్రజాసామాన్యమునకై యుద్దేశించి రచించి కుశలవులచేఁ

ప్రజలయందే ప్రచారమొనరించెను. వ్యాసభట్టారకుఁడును వేదశాస్త్రాదికములను గ్రహింపఁజాలనిసాధారణప్రజల కొఱకే భారతభాగవతాదిగ్రంథములను రచించెను. నన్నయభట్టారకుఁడు సైతము జగద్ధితమునకే యాంధ్రమహాభారతము నారంభించెను; పండితులు మాత్రమే మెచ్చినఁ జాలు నని తలంప లేదు. తిక్కనార్యుఁడును "ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ" నే భారతమును రచించెను; కొలఁదిమంది పండితులు మాత్రమే మెచ్చుకొన్నఁ జాలు నని రచింప లేదు. కావున మహాకవు లందఱు నించుమించుగఁ బ్రజాకవులే యని చెప్పవచ్చును.

## ప్రజాసాహిత్యసృష్టి

(60) ప్రజాసామాన్యమున కుపకరించునట్టిసాహిత్యమును సృష్టించుటకు నుదాత్త మగుకథావస్తువు, ప్రజావ్యవహారపరిజ్ఞానము, నిశిత మగుప్రతిభ, ప్రసన్న మగుశైలి మిక్కిలి ముఖ్యములు. ప్రజాసామాన్యమున కంతకును హృదయమునకు హత్తుకొనఁగలకథావస్తువులను శ్రేయోదాయకము లగుభావములను, ప్రాచీనసంప్రదాయములను విడనాడకయే రమణీయముగఁ జెప్పవచ్చును. ఇట్టి సహజమార్గమున రచింపఁబడినయాధునికకావ్యములు, నాటకములు, ఆఖ్యాయికలు (Novels), కథలు, కథానికలు ప్రజాదరణపాత్రము లగుచునే యున్నవి. సంప్రదాయదూరము లై యత్యంతనూతనముగ భావింపఁబడుకొన్ని రచనావిధానములు నీరసము లగుచుండుటయు గమనింపఁదగియున్నది. కొన్నిరచనలు పాశ్చాత్యవిద్యాభ్యాసముఁ

గావించినవారికే బోధపడఁదగినట్లుండును. కొన్నిశతాబ్దముల క్రిందట పుట్టినభారతభాగవతాదిగ్రంథములు నేఁటికిని బహుళప్రజానీకమునకు సులభముగ బోధపడుచుండఁగా నేఁటిరచనలు నేఁడే దురవబోధము లగుట శోచనీయము. భావకవిత్వ మని చెప్పఁబడుకొన్నికావ్యములు, అభ్యుదయకవిత్వ మని భావింపఁబడు మఱికొన్నిరచనలు, ఇట్టివి క్లిష్టతయందుండి ప్రజాసామాన్యమునకు దూర మగుచుండుట ప్రత్యక్షవిషయము. కావున ప్రజాసాహిత్యమును సృష్టింపవలయు నన్నచోఁ బ్రాచీను లైనమహాకవులవలెఁ బ్రజాహితదృక్పథము, ప్రతిభాబలము, నుదాత్తమగుకథావస్తువు, ప్రజాజీవనపరిజ్ఞానము, ప్రసన్న మగు శైలిని సముపార్జించుకొనవలయును. ఇట్లు గాక భాషయందు భావమునందు నియమరాహిత్యమును, హీనము లగుకథావస్తువులను నవలంబించి రచింపఁబూనినచో నట్టివి గ్రామ్యమగునే కాని యుత్తమసాహిత్యము కానేరదు.

## మహాకవిలక్షణములు

(61) ప్రతిరచయితయును మహాకవి యగుటకు లేదా గొప్పరచయిత యగుటకుఁ బ్రయత్నించుచుండును. మానవులకు మహత్త్వకాంక్ష సహజము; సమంజసము. మహాకవులు పూర్వ మనేకులు గలరు. వారికా మహత్త్వ మెట్లు కలిగినదో గమనించి, ఆట్టిసామర్థ్యమును బొందుట కెల్లరును బ్రయత్నింపవచ్చును. తిక్కనమహాకవి వ్యాసభట్టారకునిమహాత్త్వము నిట్లు వర్ణించెను.

"శా. విద్వత్త్వం స్తవనీయభవ్యకవితా

వేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకరసం
భావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయనుఁ డర్థి లోకహితని
ష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్య మగులే
ఖ్యం బైనయామ్నాయమున్."

—ఆంధ్రమహాభారతము. విరాటపర్వారంభము.

కృష్ణద్వైపాయనునందు భవ్యకవితావేశము, విజ్ఞానసంపన్నత, సంయమిప్రకరసంభావ్యానుభావ మను మూఁడువిశేషములు గలవు. ఇవి మహాకవు లందఱకు సాధారణలక్షణములు. ఈగుణవిశేషములు కలవాఁ డెవఁ డైనను మహాకవి యగును. కావున వీనినిఁ జక్కఁగా గ్రహింపవలసియున్నది.

## భవ్యకవితావేశము

(62) వీనియందు భవ్యకవితావేశము మొదటిది. రాగద్వేషాదులవలన మనస్సు పొంగుట యావేశము. ఇది భావప్రకటనరూప మగుచో కవితావేశ మగును. మనస్సున పొంగుచున్నభావములఁ జెప్పుటయే కవిత. ఈ యావేశము సకలసాహిత్యసృష్టికి మూలము. ఇది లేక యెవఁడును కవి కాఁజాలఁడు. కాని కేవల మైనయీ యావేశ ముత్తమసాహిత్యసృష్టికి చాలదు. అది భవ్యము

కావలయును; అనఁగా సద్విషయాశ్రయము కావలయును. సకలపురుషార్థములను రమణీయముగ మహాభారతకథా మూలమున నెల్లరకు వర్ణించిచెప్పవలయు ననునావేశము వ్యాసభట్టారకునకుఁ గలిగినది కావున నది భవ్యకవితావేశమైనది. ఇట్టిది గొప్పరచయితల కందఱకును సమానము.

## విజ్ఞానసంపన్నత

(63) కేవలభవ్యకవితావేశ మున్నను మహాకావ్యము లుదయింపవు. తలంపుమాత్రముననే కార్యము లేవియును సిద్ధింపవు. సంకల్పమునకు తగినసామర్థ్య ముండవలయును. కవితావేశము కావ్యరూపము నొందుటకు విజ్ఞానసంపన్నత యావశ్యకము. వ్యాసభట్టారకుని వేదవిజ్ఞానసంపన్నతవలననే మహాభారతమునకుఁ బంచమ వేదగౌరవము కలిగినది. ఇట్టివిజ్ఞానమే యేరచనమున కైనను గౌరవము కలిగించును. వివిధవిశేషసంకలనమే విజ్ఞానము. కవికి బహువిధపరిజ్ఞాన మావశ్యకము. వీనిలో సాహిత్య విధానవిజ్ఞానము రచనాభ్యాసము ప్రాథమికములు. స్వభాషాసారస్వతదేశమతచరిత్రాది సంప్రదాయజ్ఞాన మావశ్యకమగుసాధనము. రచయితలు యథావకాశముగ నన్యభాషాసారస్వతదేశమతచరిత్రాదిజ్ఞానమును సంపాదింపవలయును. దీనివలన మనస్సునకు విశాలత, ఉదాత్తత కల్గును. వ్యాకరణాలంకారాదిశాస్త్రపరిజ్ఞానమువలన బుద్ధికి నిశితత్వ మేర్పడును. వీనికిఁ దోడుగ లోకానుభవ మత్యంతావశ్యకము. లోకానుభవసమన్విత మైనయా

బహువిధపరిజ్ఞానమునే ప్రాచీనులు వ్యుత్పత్తి యని నిర్దేశించిరి. ఇట్టివిజ్ఞానసంపన్నుఁడే సమాజసమస్యలను గ్రహించి వానిపరిష్కారమార్గములను గుర్తింపఁగలడు; సమాజహృదయమున స్పందించుచున్న భావపరంపరలను పరిశీలించి వానిలో శ్రేయోదాయకము లగువానికి చక్కనిరూప మొసంగఁగలడు; తాత్కాలికముగ ప్రియము లయ్యు నహితము లగువానిని నిపుణముగ విమర్శించి వానిదుష్ఫలితములను కన్నులకుఁ గట్టునట్లుగ వర్ణింపఁగలడు. ఈగుణముచేత నే మహాకవి సమాజనాయకులలో నొకఁడుగ చెప్పఁదగియున్నాఁడు.

## మహానుభావము

(64) ఈ రెండును సమకూడినను మహాకవిత్వము నకుఁ జాలవు. మంచికవితావేశముతో గొప్పపాండిత్యముతో ప్రౌఢకావ్యములను సృష్టించినవా రనేకులు గలరు. అవి మహాకావ్యములు కావచ్చును. కాని వా రందఱును మహాకవులు కారు. సమగ్ర మగుగొప్పకథను సర్గబంధముగ రచించినచో నది మహాకావ్య మగును. రామాయణకథనే మరల నెందఱు మహాకావ్యములుగ రచించినను వారు వాల్మీకివంటికవులు కా నక్కఱ లేదు. ఈ కారణముచేత నే మహాకావ్యకర్త లెందఱో యున్నను ఆనందవర్ధనాచార్యుఁడు ధ్వన్యాలోకమున నిట్లుద్ఘాటించియున్నాఁడు. "ప్రతిభావిశేషమువలన, అతి విచిత్ర కవిపరంపరావాహినీమయ మైనయీప్రపంచమున కాళి

దాస ప్రభృతు లైనమహాకవులు ఇద్దరో, ముగ్గురో, యయిదుగురో, యార్వురో లెక్కింపఁబడుచున్నారు."

["येनास्मिन्नतिविचित्रकविपरम्परावाहिनि संसारे कालिदासप्रभृतयो द्वित्राः पञ्चषा वा महाकवय इति गण्यन्ते" । श्लो ६॥ ध्वन्यालोके – प्रथमोद्द्योतः]

ఈప్రతిభావిశేషము చాలవఱకు రసపోషణసామర్థ్యమునుబట్టి గుర్తింపఁబడుచుండును. కాని రసపోషణ కౌశలమువలనఁ గలుగును త్తమత్వము సైతము కవితా మహత్త్వమునకుఁ జాలదు. వాక్కునకు రసముకన్నను దీప్తి కలిగించునది వక్తయొక్క మహత్త్వము. దీనినే వ్యాసభట్టారకునియందు సంయమిప్రకరసంభావ్యానుభావ మని తిక్కనార్యుఁడు వర్ణించెను. ఈమహానుభావుని చేతనే మహాభారతమునకు లోకమున నప్రతిమానమగు ప్రభావ మేర్పడినది. వక్తవలన వాక్యమునకుఁ బ్రభావ మేర్పడుట సహజము. ఒకమాట నొకఁడు చెప్పినచో సాధారణముగనే యుండును. దానినే యొక మహాపురుషుఁడు చెప్పినచో నది మంత్రమువలె మహిమాన్విత మగును. శ్రీమద్రామాయణమహాభారతాదులలో కొన్ని యెడల రచన నీరసముగ నుండును. కాని ప్రతిపద సుందరముగ తీర్చిదిద్దఁబడిన యితరమహాకావ్యములు వాని కన్న నధికప్రభావమును కలిగియున్నవని చెప్పఁజాలము. ఆంధ్రమున మహాభారతభాగవతములకు, ప్రబంధములకును గలయీభేదము సుప్రసిద్ధము. ఈతారతమ్యమునకు కవిమహత్త్వమే కారణము.

# మహితాత్ములు కానివారు మహాకవులు కాఁజాలరు

(65) "మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షుఁ తన్", అని నన్నయభట్టారకునిగూర్చియుఁ తిక్కనార్యుఁడు చెప్పినట్లుగ, ప్రాచీను లగుమహాకవు లందఱును మహితాత్ములు. మహితాత్ముఁడు కానివాఁడు మహాకవి యగుట యసంభవము. ఈయర్థముననే "ఋషి కాని వాఁడు కావ్యము రచింపఁడు." (नानृषिः कुरुते काव्यम्) అనుసూక్తియు నేర్పడినది. ఋషి యనఁగా క్రాంతదర్శి; అనఁగా గడచిపోయినదానిని జరుగుచున్న దానితో సమన్వయించుకొనుచు జరుగవలసినదానిని గుర్తింపఁగలవాఁడు. ఈయభిప్రాయమునే వ్యక్తీకరించుచు కార్లైల్ అను నాంగ్లవిమర్శకుఁడు కవిని వీరునిగ నిర్దేశించెను. "వీరుఁడు, ప్రవక్త, కవి, —మహాపురుషులకు వివిధదేశకాలములయందు నిర్దేశింపఁబడువివిధనామములు. వారియందలిప్రత్యేకతలను మనము గుర్తించుటను బట్టి, వారు తమశక్తిని ప్రదర్శించినకార్యరంగములను బట్టియు నామముల నొసంగుచున్నాము."

[Hero, Prophet, poet, – many different names, in different times and places, do we give to great men; according to varieties we note in them, according to the sphere in which they have displayed themselves!

–Thomas Carlyle, from "The Hero as Poet" Para-2 ]

కావున కవిని వీరుఁ డనియు చెప్పవచ్చును. మహా కార్యనిర్వహణసంకల్పమునఁ గలుగునుత్సాహాతిశయమే వీరత్వము. ఇది సర్వమహాపురుషసాధారణము. సాహిత్యమునం దిదియే మహాగ్రంథరచనోద్యమరూపమున వ్యక్తమగుచుండును. వాల్మీకివ్యాసులు, ఆంధ్రమున కవిత్రయ పోతనాదులు నిట్టిసాహిత్యవీరులు. కావుననే మహాకవులు సాధారణముగ ఋషులో, కర్మఠులో, భక్తులో, జ్ఞానులో, యై యుందురు. వా రందఱు నిష్కాములు, లోకహితపరాయణులు. లోభులు ధనమునువలె, వారు తమయింద్రియశక్తులను భోగములకై వెచ్చింపక నిగ్రహించి తేజోమహితు లగుచుందురు. ఎవఁ డెంతగ స్వార్థ సుఖాసక్తిరహితుఁడై, యింద్రియనిగ్రహమున తేజస్వియై, లోకహితకార్యాచరణదక్షుఁ డగునో యతఁ డంతగా మహత్త్వము నొందును. వానివాక్కున కంతప్రభావము కలుగును. కావుననే వారివాక్కు లొకప్పుడు నీరసముగ నున్నను జనులు వాని నాదరించుచునే యుందురు. రచనమున వ్యుత్పత్తిలోపమును ప్రతిభ కప్పివేయఁగల దనుట సుప్రసిద్ధము. కాని యీరెండింటిలోపము నీమహత్త్వము తీర్పఁగలదు. స్తోత్రములు, శతకములు మొదలగు నవి యనేకము లిందులకు దృష్టాంతములు.

## మహత్త్వహేతువులు

(66) కావున రచయిత లీమహత్త్వము సంపాదింప యత్నించుట యావశ్యకము. కాని యశోధనభో

గార్థుల కిది దుష్ప్రాపము. ధార్మికనియతవర్తనము, నిస్వార్థ మగు ఁకహితనిష్ఠ దీనికి ముఖ్యహేతువు లని చెప్పవచ్చును. దీనినిగూర్చి వివేకానందుఁ డిట్లు చెప్పెను. "మానవశరీరమునఁ గలసకలశక్తులయందు నత్యున్నత మగునది యోజ స్సని యోగులు చెప్పుదురు. ఇది మెదడు నందు రాశీభూత మై యుండును. శిరస్సునం దిది యెంత యధికముగ నుండునో యావ్యక్తి యంత యధికముగ శక్తి మంతుఁడు, బుద్ధిశాలి, ఆధ్యాత్మికశక్తిమంతుఁడు నగు చుండును. ఒకానొకఁడు రమణీయభావమును రమణీయ మగుభావయందు చెప్పవచ్చును. కాని యవి ప్రజలమన స్సున కెక్కవు. వేఱొకఁడు రమణీయ మగుభావను గాని, రమ్యభావములఁ గాని, ప్రకటింపఁడు. ఐనను వాని మాటలు మిక్కిలి యాకర్షించును. వానియందలి ప్రతిచలన మును శక్తిమంతముగ నుండును. అది యోజోమహత్త్వము" ........."పవిత్రు లగుస్త్రీపురుషులు మాత్రమే యోజ స్సును పైకిఁ దెచ్చి మెదడునందు కూర్చుకొనఁగలరు. ఈకారణముచేతనే పవిత్రత యత్యున్నతగుణముగ నెల్ల ప్పుడును భావింపఁబడుచున్నది. ఎవఁడైనను తన్నుపవి త్రునిగ భావించినచో వానినుండి యాత్మశక్తి వెడలి పోవును. అతఁడు వెంటనే మనశ్శక్తిని, ధర్మబలమును కోల్పోవును".

[The Yogis claim that of all the energies that are in the human body the highest is what they call "Ojas". Now this Ojas is

stored up in the brain, and the more Ojas is in a man's head, the more powerful he is, the more intellectual, the more spiritually strong. One man may speak beautiful language and beautiful thought, but they do not impress people; another man speaks neither beautiful language, nor beautiful thoughts, yet his words charm. Every movement of his is powerful. That is the power of Ojas."...... ......P. 169.

"It is only the chaste man or woman who can make the Ojas rise and store it in the brain; that is why chastity has always been considered the highest virtue. A man feels that if he is unchaste, spirituality goes away, he loses mental vigour and moral stamina."

— Page 170. "Raja-Yoga". "Swamy Vivekananda's Works." Part I 6th edition]

## ప్రామాణికప్రసంగములు

(67) ఉత్తమసాహిత్యసృష్టికి మహిళాత్ము అగు రచయిత లావశ్యక మైనట్లే, ఆసాహిత్యము, సంస్కృతి ప్రజానీకమునకు సులభ మగుటకు సక్రమప్రసారసాధన విధానము లావశ్యకములు. భావప్రసారమునకుఁ బ్రసంగ ములు ప్రముఖసాధనములు. వీనిమూలమునఁ జక్కని సాహిత్య విమర్శను, సంస్కృతివిశేషములను సులభముగాఁ బ్రబోధింపవచ్చును. కావున నిట్టివిషయములనుగూర్చి ప్రామాణికప్రసంగవిధానములను పెంపొందించుకొనుట

యావశ్యకము. ఏవిషయమునుగూర్చి నైన నుపన్యాసకు లప్పటికప్పుడు తోఁచినట్లు ప్రసంగించుటయు శ్రోతలును వాని సంతటితో విస్మరించుటయు పరిపాటిగ నున్నది. ఇట్లుగాక ప్రసంగములు ప్రామాణికగ్రంథములు కాఁదగి నట్లుగ తగినవిధానముల నేర్పఱుపవలెను. సమర్థు లగు వారికి ముందుగ విషయముఁ దెలియఁజేసి వారు దానిని గూర్చి సకలాంశములను చక్కఁగా సేకరించుకొనుటకు తగినంతయవకాశ మొసంగవలయును. ప్రసంగములు ముగిసినవెంటనే వానిని ముద్రించి గ్రంథరూపమునఁ బ్రకటించినచో నుపన్యాసకులభావముల కధికప్రసారావ కాశము లేర్పడును; ప్రసంగములును సార్థకము లగును.

## ప్రామాణికగ్రంథసంగ్రహములు

(68) సంస్కృతిప్రసారమునకు మహాగ్రంథసంగ్రహములను ప్రకటించుటయు నావశ్యకము. రామాయణభారతాదిగ్రంథము లన్నియు బహువిశాలములు. వాని నొక్కసారిగ నల్పకాలమునఁ జదువుటకు వీలు లేదు. కావున వానిని మూలగ్రంథకర్తలవాక్యములలోనే విద్యార్థులకు, విద్వాంసులకు, సాధారణప్రజలకు తగి యుండునట్లుగ ననేకవిధము లైనసంగ్రహములను చిన్న గ్రంథములనుగ బ్రకటించినచో, వానిస్వరూపమును సులభముగ ననేకులు గ్రహింపఁగలిగియుందురు. సంస్కృతమున శ్రీమద్రామాయణాదుల కిట్టిసంగ్రహములు కొన్ని కలవు. ఆంధ్రమహాభారతభాగవతాదుల కిట్టివి యావశ్యక

మై యున్నవి. వీనివలన నుత్తమసాహిత్యమును, సంస్కృతిని సులభముగ ననేకుల కందింపవచ్చును.

## గ్రంథప్రసారము

(69) నేఁడిట్టిప్రామాణికప్రసంగములను, మహాగ్రంథసంగ్రహములను, స్వతంత్రరచనములను ప్రోత్సహించుటకు పరిషత్తులు, గ్రంథప్రకాశనసంస్థలు, పత్రికలు మొదలగునవి యనేకములు వెలయుచున్నవి. కాని యేసంస్థ కైనను, ప్రభుత్వమున కైనను పెక్కుమంది రచయితలను ప్రోత్సహించుటకుఁ గాని ఒహుగ్రంథములను జక్కఁగాఁ బ్రకటించుటకుఁ గాని తగినయవకాశము, సంపన్నత సంభవింపదు. ధనవంతము లైనకొన్ని సంస్థలు గ్రంథములను బ్రకటింపఁగల్గినను నవి ప్రజాసామాన్యమునకు సులభముగ నందకపోవచ్చును. కావున సద్గ్రంథరచనమును బ్రోత్సహించుటకు, రచిత మైన దానిని చక్కఁగా ముద్రించి ప్రకటించుటకు, ప్రకటించినవెంటనే చాలమందిపాఠకుల కందించుటకును తగిన విధానమును నిర్మించుకొనవలసియున్నది.

## గ్రంథమాలావిధానము

(70) సుమా రేఁబదియేండ్లక్రిందటనే యాంధ్రదేశమున నీసమస్య యేర్పడి చక్కఁగాఁ బరిష్కరింపఁబడినది. నాఁ డాంధ్రదేశమునఁ బ్రతిప్రాంతమునందును పెక్కుగ్రంథమాలలు వెలసినవి. వాఙ్మయమునం దభి

మానముఁ గలవారిని చందాదారులనుగఁ జేర్చి, సంవత్స రమున కొకసారి చందాలను వసూలుచేసి, యాపెట్టు బడితో సంవత్సరమునకు రెండుమూఁడు గ్రంథములను బ్రక టించి, వెంటనే వానిని దేశమున నలుమూలలఁ గలపాఠ కుల కందించి గ్రంథమాలలను నిర్వహించుచుండిరి. చందామూలమున ధనమును ముందుగనే వసూలుచేసి యుండుటవలనఁ బాఠకులు కుతూహలముతోఁ గ్రంథ ములకొఱకై వేచియుండి వచ్చినవెంటనే తప్పక చదువు చుండెడివారు. ఈపద్ధతివలన రచయితలకు సులభముగ గ్రంథములు ప్రకటింపఁబడుటయే గాక ప్రజలయందు నల్పకాలముననే యధిక ప్రచారము గలుగుటయు సంభ వించుచుండెను. గ్రంథములకు పోషకులు ప్రజలే యగుట వలన వారియభిప్రాయములను గ్రహించి వారికి సులభ ముగా, రమణీయముగ విషయముల నందించుటకు రచ యితలును తమరచనావిధానములను, భావములను సవ రించుకొనుట కవకాశ మేర్పడుచుండెను. ఈవిధానము వలన రచయితలకును బ్రజలకు నేర్పడఁగల సన్నిహిత సంబంధము మఱియొకవిధముగ నేర్పడదు. మఱియు నిట్టి విధానమువలన గొప్పగొప్ప వైజ్ఞానిక గ్రంథములను సైతము బ్రజలకు సులభముగ నందించుట కవకాశ మేర్పడు చుండును. ఈవిషయమున 'విజ్ఞానచంద్రికా గ్రంథమండలి' ప్రధానముగ స్మరింపఁదగినది. దానియందు దీశతాబ్దారంభ మున నే 'హిందూదేశకథాసంగ్రహము' మొదలగు చరిత్ర గ్రంథములనే గాక ప్రకృతిశాస్త్రగ్రంథములను పెక్కిం

టిని ప్రకటించిరి. ఆంధ్రవిజ్ఞానసర్వస్వమును సైతము ప్రకటించుటకు ప్రయత్నించి ప్రథమసంపుటమును ప్రకటించిరి. నాఁటినుండి నేఁటివరకు నా గ్రంథమాలావిధానమే యాదర్శప్రాయముగ నున్నది. నేఁడును ఇతరల సాహిత్యపోషణమునకై పత్రికలు, పరిషత్తులు, విశ్వవిద్యాలయములు, ప్రభుత్వము లిట్టిగ్రంథమాలా విధానమునే యవలంబించుట శ్రేయస్కరము.

## కార్యక్రమవిధానము

(71) ఈసాహిత్యసేవాకర్తవ్యమును యథాశక్తిగ నిర్వహించుటయే యీసాహిత్యమండలికి ప్రధానాశయము. విద్యార్థియువజనులకుఁ బ్రాచీనభారతీయ సంస్కృతితో సజీవమైనసంబంధము పెంపొందించుట ప్రాథమికకర్తవ్యము, గావున నిందు తత్సాధనము లగు కార్యక్రమము లేర్పఱుపఁబడుచున్నవి. వీనిలో సంస్కృత భాషాభ్యసనబోధనము, సంస్కృతసారస్వతప్రచారము ప్రధానములు. ఆంధ్రము, హిందీ మొదలగు ప్రాంతీయ భాషాసారస్వతములందు, ఆంగ్లమునందును విజ్ఞానప్రదము లగునుపన్యాసములు, చర్చలు, బహుముఖప్రసంగములు (Symposiums) సమకూర్పఁబడుచున్నవి. లలితకళాభ్యాసము నానుషంగికముగఁ బ్రోత్సహింపఁబడుచున్నది. భారతీయులకుఁ బర్వదినము లగుశ్రీరామనవమి మొదలగు నవి యథోచితముగ సామాజికోత్సవములుగ జరుపఁబడు

చుండును. సకలకార్యక్రమములందు నఖిలభారతీయ దృక్పథము, సకలమతసామరస్యముఁ బ్రధానసూత్రము లుగ నున్నవి. వీని కనుబంధముగ కవితాగోష్ఠులు, కళా ప్రదర్శనములు, కవిపండితకళాశిల్పిసత్కారములు జరుపఁ బడును. సాంస్కృతికము లగునితరసంస్థలతో సహక రించి వర్తించుటకు నీమండలి ప్రయత్నించును.

## ధర్మకర్తవ్యము

(72) ఈకార్యక్రమనిర్వహణ మొకధర్మకర్తవ్య మునుగ భావింపవలసియున్నది. కావునఁ బ్రభుత్వములపై నాధారపడక, రాజకీయపక్షముల ననుసరింపక సాహిత్య సంస్కృతిపరాయణు లగుయువకులే యీకార్యక్రమము లను స్వయంకృషితో సాగింపవలసియున్నది. ఈకర్తవ్యా చరణమునకే 'శ్రీమదనమోహనమాళవీయసాహిత్యమం డలి' యనునీసంస్థ ప్రారంభింపఁబడినది.

श्लो. साहित्यमण्डलीतत्त्वं, प्रारंभाशयलक्षितम् ।
विवृतं सुखबोधार्थं, माळवीयाशयोचितम् ॥

श्लो. निराकृतं निरात्मत्वं, सदात्मत्वं स्थिरीकृतम् ।
दर्शितं भारतीयत्वं, साहितीसारकल्पकम् ॥

श्लो. अपारे भारतीयत्वे, धर्मतत्त्वार्थलक्षिते ।
अल्पोऽयं रचितो ग्रंथ, स्सर्वेशः प्रीयतामिति ॥

"This is the right course for the youth of the country to not only remember for the great past but also pick up the best for the use of the Nation and the World".

*Sri P. Thimma Reddy*

MINISTER FOR AGRICULTURE
ANDHRA PRADESH CABINET

* * *

" శ్రీ మదనమోహనమాలవీయ సాహిత్యమండలి కొలది సంవత్సరములనుండి సాహిత్యములో ఉత్తమకృషి చేయుచున్నది. ఇట్టి మండలి సమక్షమున నేను కావ్యగానము చేయుట సంతోషదాయకము. ఈ మండలి జేగీయమానమగుగాక "

శ్రీ శివశంకరస్వాములవారు,
సికిందరాబాదు.

* * *

" ఈ సాహిత్యమండలి సాహిత్యకృషి ఇతోధికముగాచేసి ఆంధ్రలోకమంతట ప్రశంసనీవహించుగాక "

కవిసమ్రాట్ శ్రీ నోరి నరసింహశాస్త్రి,
B. A. B. L.,
సాహితీసమితి, రేపల్లె.

" సాహిత్యమండలివారి కృషి ఎంతయు ప్రశంసింపదగినది. అచిరకాలములోనే సాహిత్యగోష్ఠిలో ప్రథమశ్రేణిలో విరాజిల్లవలయునని భగవంతుని ప్రార్థించుచున్నాము."

వ్యవస్థాపకః, సంస్కృతభాషాప్రచారిణీసభ, చిత్తూరు.

★ ★ ★

" ఆశీస్సులు "

శ్రీ నార్ల వేంకటేశ్వరరావు, B. A.,

రాజ్యసభ సభ్యులు

ఎడిటర్, " ఆంధ్రప్రభ "

★ ★ ★

" అభినందనః

శ్రీ కప్పగంతుల సత్యనారాయణ,

**Sub-Editor, " MAIL "**

## పత్రికాభిప్రాయములు



" ఈసాహిత్యమండలి ఆదర్శవంతంగా పనిచేస్తుండడం సంతోషించదగిన విషయం. సభలు, సాహిత్యచర్చలద్వారా యువజనులలో భాషాభిమానాన్ని, విషయజిజ్ఞాసను, దేశభక్తిని ప్రబోధిస్తున్న ఈ మండలి,

"బులెటిన్" ద్వారా రచనాశిల్పాన్ని పెంపొందించు కొనే అవకాశాన్ని కలుగచేయుటం మిక్కిలి ప్రశంసనీయం. ఈమండలి చిరంజీవియై, సేవచేయుగాక యని కోరుచున్నాము. ఉత్సాహవంతులైన మా దళికార్యకర్తలను అభినందిస్తున్నాము."

— జమీన్ రైతు.

31-1-58

* * *

"యువకులు సాహిత్యమండలిని నెలకొల్పుట ప్రశంసించదగిన విషయం. ధిక్కారణమే భూషణమను కొనే విద్యార్థులదినాలు యివి! ఇట్టిసందర్భమున విధేయత, ఒజ్జలపట్లవినయము చూపుచు, సారస్వతసంఘమును ఏర్పరచుట అపూర్వైనసంఘటన...... కాబట్టి ఈసంఘము దినదినాభివృద్ధి నొందునుగాక!

— మందాకిని.

15-5-57

# మండలి సభ్యుల గ్రంథములు



## శ్రీ పోలూరి హనుమజ్జానకీరామశర్మ, B. A., (Hons)

ముద్రితములు :

1. బాపూజీ :
   పద్యాత్మకఖండకావ్యము 0- 8- 0
2. విజయభారతి :
   భారతీయకథల సంపుటి 0-12- 0
3. విద్యార్థిరచనోపదేశిక :
   (i) వ్యాసానువాద పద్ధతులు 2- 0- 0
   (ii) సారసంగ్రహ పద్ధతులు 2- 0- 0

అముద్రితములు :

1. నేఁటి మనభాషల సమస్య :
   వ్యాసముల సంపుటి.
2. శ్రీకృష్ణుఁడు :
   మహాభారతము ననుసరించి కావింపఁబడిన గుణ విశేషపరిశీలనాత్మక మగునుపన్యాసము.
3. సుమనోంజలి :
   దేవతావిద్వత్స్వరూపఖండకావ్యముల సంపుటి.
4. ఝాన్సీలక్ష్మీదేవి:
   పదునెనిమిది సర్గలగేయమహాకావ్యము.

౫. నాయకోదయము :

స్వాతంత్ర్యోద్యమమున బ్రతిబింబించు సాంఘికేతి వృత్తముగలపదియాశ్వాసముల పద్యమహాకావ్యము

6. శ్రీనలచరిత్రము :

స్వయంవరారణ్యాభ్యుదయము అనుమూడుకాండ ములుగల యిఱువదియొక్క యాశ్వాసములచంపూ మహాకావ్యము.

—(o)—

साहित्यविद्याप्रवीण, भाषाप्रवीण,

श्रीमान् कि· श्री· रामानुजाचार्यः

मुद्रितः : रू. अ. पै.

1. शुकसंदेशः : खंडकाव्यम् 0—5—0

अमुद्रिताः :

1. हयग्रीवविजयः : पद्यकाव्यम्
2. वैकुंठनाभपंचाशत् : स्तोत्रम्
3. वक्षोजलहरी : खंडकाव्यम्
4. विरहीः : खंडकाव्यम्
5. मुक्तकमुक्ताकलापः :
6. शिखा : एकपात्राभिनयः
7. वकुलमाला : गद्यकाव्यम्
8. शिवधनुर्भंगः : नाटिका

శ్రీ కందుకూరి కోటేశ్వరరావు. B. A., B. Ed



ముద్రణలోనున్నవి :

1. సీతాకళ్యాణము
2. రుక్మిణీకళ్యాణము

} సాంఘిక నాటికలు
కందుకూరి B A., B. Ed.,
& శంకర్ B Sc.,

3. పశ్చాత్తాపము : సాంఘిక నాటిక
4. పశ్చాత్తాపము : చరిత్రాత్మక నాటిక
5. "1957" : సాంఘిక నాటిక
6. ప్రాణభిక్ష : చరిత్రాత్మక నాటిక
7. "10-17 P. M." : డిటెక్టివ్ నాటిక

పై ఏకాంకికలు పలుమారు, పలుతావులందు మండలి సభ్యులచే, తదితరులచే నటింపఁబడి మన్ననలందు కున్నవి.

ముద్రింపనున్నవి :

సాంఘిక ఏకాంకిక నాటికలు :

1. పంచశీల. 2. పిచ్చివాళ్ళు. 3. చాచానెహ్రూ జిందాబాద్. 4. కట్నంకోసం. 5. కన్యకోసం. 6. చదువుకోసం. 7. అదృష్టం. 8. అయోమయం. 9. అవతారాలు. 10. తావురాబడి. 11. బ్రతికినశవం (డిటెక్టివ్). 12. చీమలు.

